


# కావేరి

జగన్మాత నాల్గు శక్తులును ఆమె విశేషమూర్తులలో నాలుగు మూర్తులు; అవి యామె యంశములు; వానిలో నామె దివ్యత్వము మూర్తీభవించినది; ఈ మూర్తులమూలమున నామె తన ప్రాణికోటిని పరిపాలించును. లోకములందలి సృష్టిజాలమును శాసించును; ఆమె సహస్రశక్తులు ఎట్లు ప్రవర్తించవలెనో నిర్దేశించును. ఎందువలన ననగా జగన్మాత ఏకస్వరూపిణి అయినప్పటికిని భిన్న భిన్న స్వరూపములతో మనకు గోచరించును. విశ్వమునందామె కార్యము నెరవేర్చు ఆమె శక్తులు మూర్తులు అనేకములు; విభూతులు ఆవిర్భావములు అనేకములు. జగన్మాతయని మన మే యొక్కరిని పూజింతుమో, ఆమె చిత్ శక్తియే; ఆమెయే సృష్టినంతయు పరిపాలించుచున్నది. ఆమె ఏకమయినను పలువిధమగుటచేత నెటువంటి సూక్ష్మబుద్ధికిని, స్వతంత్రమైన గొప్ప వివేకమునకును, ఆమె వ్యాపారములను తెలుసుకొనుట దుర్లభము. ఈశ్వరుని చిత్ శక్తియే జగన్మాత.

—జగన్మాత.

కవేరుఁడను నొక ముని మోక్షాసక్తుఁడై బ్రహ్మనుగూర్చి పదివేలేండ్లు తపమొనరించెను. తన కార్యక్రమము ప్రకారము బ్రహ్మ తుదకు ప్రత్యక్షమై కవేరుని కావలసిన వరమడుగు మన నాతఁడు ముక్తిని ప్రసాదింపుమని ప్రార్థింపఁగా బ్రహ్మ "విష్ణు పుత్రికను మాయను నీపుత్రికగా నిచ్చెదను, ఆమె వలన మోక్షమును బడయు"మని యతనికి చెప్పి విష్ణు మాయతో నాతనికిని, తన్ను కోరెడి యితరులకునుగూడ మోక్షమొసఁగుచుండుమని నియమించి యంతర్హితుఁ డయ్యెను.

ఋషియు విష్ణుమాయను మోక్షమునకై ప్రార్థింపఁగా నామె దత్తపితకు మోక్షమే గాక ప్రపంచమున చిరయశస్సును లోకులకు ముక్తియుగలుగు నుపాయమును జింతించి, లోపాముద్రనామమున, తన తండ్రియగు విష్ణుని గూర్చి తపమొనరించెను. అతఁడును సంసిద్ధుఁడై సాక్షాత్కరించి యథాప్రకారముగ వరమడుగుమనుడు నామె నదీ రూపముననుండి యితరులకు మోక్షమొసగు నిచ్ఛ తనకు గలదనియు, దనయందు స్నానముచేసిన యెట్టి పాపులైనను మోక్షార్హులు గావలయుననియు వరము గోరుకొనెను. దాని కంగీకరించుచు విష్ణువు తాను శాక్యపర్వతమున ఆమలక వృక్ష (ఉసిరిక చెట్టు) రూపమున నుందుననియు, నచటికి బ్రహ్మ 'విరిజా'నదీ జలపూరితమగు శంఖుచే నరుదెంచి తన్ను పూజించుననియు, నాజలములో నుద్భవమై, దక్షిణ గంగయనుపేర ప్రసిద్ధరీతి వఱలుమనియు, నామె జన్మస్థలమున దత్తాత్రేయ నామముననను, శ్రీరంగనాథ నామమున నామె యొడియందును తానుండుననియు మాయతో చెప్పి యావిధముగనుండెను. మాయయు బ్రహ్మపూజించిన జలంబుల జనించెను. ఆతీర్థ మందుచేతనే 'శంఖ తీర్థ' మనియు, 'సత్యామలకతీర్థ'మనియు పిలువఁబడును.

ఈ వృత్తాంతమంతయు నెఱింగిన బ్రహ్మ శాక్య పర్వతమున నగస్త్యుని గలసికొని కావేరిరూప ధారియగు లోపాముద్రను భార్యగా గ్రహించి భూలోకమునకు గొని చని ముక్తి ప్రదముగా చేయుమని వచింప నాతఁడంగీకరించి యామెను భూలోకమునకు గొనివచ్చెను. కావేరి జననాదికమును గూర్చిన నైతిహ్యమిది. లోకమునందు జనోపయోగమగు దేనికైనను మాహాత్మ్యమంట గట్టుచుండుటయు, నట్టివెల్ల జగన్మాత ప్రాధాన్యముచే స్త్రీ నామములుగా వ్యవహరించుటయు, క్రొత్తదిగాదు. అట్టిచో, సుమారు ఐదువందలమైళ్ల నిడివితో, కోట్ల కొలది జనులకు జీవనాధారమై యుండు కావేరి కిట్టి మాహాత్మ్యమారోపించుట విచిత్రముగాదు. నేఁడు కావేరియను పదమునకు కవేరమునివలన పుట్టినదని గాక ఇట్లువచింతురు. 'కావు' 'ఏరి' అను రెండు పదములునుచేరి కావేరియైనది. 'కావు' అనగా ఎరుపు (కావిరంగు)రంగు, 'ఏరి' యనగా తమిళభాషయందు నది, చెరువు అని యర్థము. దాన ఎరుపు నీరుగల నది యను నర్థమున కావేరియను నర్థము వచ్చినది. కావేరి జలమునందు వంఘు ఎక్కువగా చేరి యెరుపుగానుండుట ప్రసిద్ధము గనుక నిట్టి పేరు బైలుదేరియుండ తరువాత ఆ పేరునకు సరిగా కథనల్లి దానికి వ్యుత్పత్తి యనుచు నూహించియుండవచ్చును. కావేరి యైతిహ్యముననుసరించి ప్రక్కనుగల త్రివర్ణ చిత్రము చిత్రింపబడినది.

# గృహలక్ష్మి

శ్రీమతి వి. మహాలక్ష్మిగారు

ఉ. ఎన్నఁడుగాని కైతయన నెట్టిదొ నేర్వని నాకునిప్డు బల్
తిన్నని వాగ్విలాసములఁ దీర్చిరచించు కవిత్వతత్త్వముల్
గ్రన్నన నేర్పినావు గృహలక్ష్మి! నినుం బఠించుచుంట నే
నెన్నటికైన నీఋణమొకింతయునైనను దీర్పనేర్తునే?

సీ. నీమూలమునఁగాదె నిఖలధర్మంబుల, నిరతంబు శ్రద్ధతో నరయుచుంటి
నీమూలమునఁగాదె నెరవగు స్త్రీధర్మ, మత్యంతభక్తితో నరయుచుంటి
నీమూలమునఁగాదె నీతిబోధకమగు, వ్యాసంబులెన్నేని నరయుచుంటి
నీమూలమునఁగాదె యేమూలలోనున్న, నరయఁజాలనిలోక మరయుచుంటి

గీ. ఇట్టి నీతికిఁగీర్తికి నెల్లయెడల, నాలవాలమై యున్ననీ మూలముననఁ
గాదె యోగృహలక్ష్మి! భాగ్యభవభాగ్య, సౌఖ్యజీనవమరయంగఁ జాలితిపుడు.

చ. నెలకొకసారి నాహృదయనీరజమందున నీస్వరూపమున్
నిలుపుదువీవు తత్క్షణమె నెచ్చెలిపిండును జేరఁదీసి నీ
సలలిత వాగ్విలాసములసారము నంతయుఁ గ్రోలుచుందు నీ
వలనసమస్త సంపదలువర్ధిలుగా గృహలక్ష్మిపత్రికా!

గీ. అట్టినీమేలు మఱువంగనెట్టులౌను, చెప్పికొనుచుందు నెలదాక యొప్పిదముగ
నంతలోనన నీజాడ నరయుచుందు, నిట్లె సకలమానందమై యొసఁగునాకు.

గీ. నిన్నుఁబాసిన క్షణమెప్డు నేనెఱుంగ, మెలఁగుచుందును నీలోనఁ గలసిమెలసి
నెచ్చెలివటన్న నాకెప్డు నీవసుమ్మ, నాదు జీవయాత్రకు మంచినౌకవీవ.

చ. కవితవచోవిభూతియొసఁగన్ గలకంఠమునెత్తిపాడు మో
లలన! వికాసమై మిగులశ్రావ్యమునై మధురంబునై మహా
లలితమునై ప్రకాశమయిరాజిలు సత్కవితా వినోదలీ
లలు కవిసార్వభౌములు నిరంతరమున్ నినుమెచ్చునట్లుగన్.

# ఆముక్తమాల్యద

శ్రీమతి పాకల రాజామణెమ్మగారు

ఆదినుండియు మనదేశమున అన్నివిజ్ఞానములకన్న ఆధ్యాత్మవిజ్ఞానము మిన్నయైనది. ఎందరో పురుషులు, స్త్రీలు, బాలబాలికలు, భగవంతు ననన్యాపేక్షమగు భక్తిప్రేమలచేగొలిచి తన్మయులై యాతనియం దైక్యమైనట్లెన్నో చారిత్రకనిదర్శనములున్నవి. మాతాపుత్రన్యాయముగ కొందరు, సతీపతిన్యాయముగకొందరు, ప్రభుసేవకన్యాయముగకొందరు, గురుశిష్యన్యాయముగ కొందరు, ఇట్లనేకవిధములుగా భగవంతుని ప్రేమించిరి. అందు స్త్రీలు మాతృసుతన్యాయముగను, పతిపత్నీన్యాయమును ఎక్కువధ్యానించిరని రాధ, మీరాబాయి, తరిగొండ వెంకమాంబ మొదలగు ననేక భక్తశిఖామణుల చరిత్రములవలన తెల్లమగుచున్నది. ద్రావిడులలో ఆండాళు, ఆముక్తమాల్యద, చూడికుడుత, కోదైయను పేళ్లతో వ్యవహరింపబడు బాలభక్తశిరోమణిచరిత్ర చాల నాహ్లాదకరమును పవిత్రమునైయున్నది.

ఈమె పాండ్యదేశమున శ్రీవిల్లిపుత్తూరను ఊరియందు తులసివనమున విష్ణుచిత్తుడను పరమభక్తునకు దొరికెను. ఆవిప్రుడీశిశువును గొనివచ్చి మక్కువతో పెంచి విద్యాబుద్ధులు గఱపుచుండెను. ఆండాళుకూడా, జనకునితో, దేవునకు పుష్పమాలలుగట్టి యిచ్చుచు నాతనివల్ల శ్రీవిష్ణుదేవుని లీలావతారవిశేషములను వినుచుండెడిది. సాధువుల పరిత్రాణమునకును దుష్కృతుల వినాశమునకును లీలామానుష విగ్రహుడెత్తిన లీలావతారములలో కృష్ణావతారమన్న నీమెకెక్కువప్రీతి జనించెను. తాను నాకృష్ణునే పెండ్లాడవలెనని కోరుచుండెను. భాగవతములో గోపికలు ధనుర్మాసవ్రతము నాచరించి కృష్ణుని పెండ్లాడిన ఘట్టముజదివి తానుగూడ ఆ వ్రతమాచరించిన కృష్ణసాన్నిధ్యమబ్బునని యెంచి తండ్రివలన ఆ వ్రతవిధానము బాగుగాదెలిసికొని వ్రతమాచరింప నారంభించెను. ఆ కాలమున గోపిక లొకరి నొకరు హెచ్చరించుకొని యందఱును గుమిగూడి శ్రీకృష్ణునినగరుజేరి కృష్ణునిప్రార్థించి యీప్సితార్థముబడసిరి. ఈమెకా గోపికలు లేరు. కాన భక్తిశ్రద్ధలతో ప్రతిదినము వ్రతమాచరించి వారెట్లొకొక్కగోపికను లేపుకొని గోష్ఠియందుకలుపుకొనిరో యట్లే మనమున నూహించుకొని తన పాండితీగరిమచే పాశురములని ద్రవిడమున జెప్పబడు పద్యములురచించెను. కొన్ని పాశురములలో గోపికలను లేపునట్లును, ఆవెనుక కృష్ణుని ద్వారపాలకుని, నందయశోదలను, నాగ్నజితిని, కృష్ణునిలేపునట్లు పద్యములు రచించెను. మాసదినము లిట్టిదీక్షతో వ్రతమొనర్చి మాసాంతమున తండ్రితో శ్రీరంగమునకేగి రంగనాథుని సాన్నిధ్యమున ఈ ముప్పదిపాశురములను భక్తితన్మయతతో జదివి కట్టకడపట భక్తిపారవశ్యమున అచేతనురాలై పోయెను. ఆ పవిత్రురాలి జీవనజ్యోతి పరమాత్మునియందు లీనమైపోయెను

భౌతికశరీరముతోనే భగవంతునియం దైక్యమైపోయెననియు విష్ణుచిత్తుడు పుత్రికావియోగము సంహింపలేక దేవుని ధ్యానించగా రంగధాముడు తన పాదసాన్నిధ్యమున చూడికుడుత ప్రతిమ గాన్పింపజేసినట్లును ఆ యర్చావతారములకే పంగునినెలయందు తిరుక్కల్యాణమని వివాహమహోత్సవము జరుపుచున్నట్లును అనేకు లనేకవిధములుగా వ్రాసియున్నారు. ఏదియెట్లున్నను ఆ పరమ భక్తురాలు భక్తిపారవశ్యమునొంది భగవంతునియం దైక్యమైన మాటమాత్రము నిజము. అప్పటి కామెకు పన్నెండుసంవత్సరముల వయస్సని చెప్పుదురు. ఇంత చిన్న వయసుననే యిట్టిభక్తి యింతపాండిత్యము గల్గుట యెంతయపూర్వమో చూడుడు. అందువలననే యిట్టివారలను భగవదంశసంభూతులందురు. బాల్యచాపలమున తండ్రి కట్టిన పుష్పమాలలను తండ్రిలేనిసమయమున తానుధరించి యద్దమున యందముజూచుకొని యెప్పటియట్లు పెట్టుచుండెడిదట. ఒకదిన మా మాలలో వెండ్రుకయుండుట పూజారి గాంచి విష్ణుచిత్తునితో జెప్ప నాత డా యపచారమునకు ఖేదపడి పుత్రికనడుగ నామె నిజమొప్పుకొనెను. అట్లుచేయవలదని పుత్రికకు బుద్ధిజెప్పి మంచిమాలికలను తిరిగి కొనిపోయి స్వామికి సమర్పించెను. దేవదేవు డర్చకుని స్వప్నమందు సాక్షాత్కరించి గోదాదేవి ధరించినపూవులే తనకుప్రియములు గాన అట్టిపుష్పములనే యికమీద సమర్పింపుమని చెప్పెనట. అందువలన నామెకు ద్రవిడమున చూడికుడుత్తయనియు, సంస్కృతమున ఆముక్తమాల్యదయనియు పేరు వచ్చెను. ఈమెరచించిన తిరుప్పావై యను గ్రంథ మతిమనోజ్ఞముగను భక్తిరసప్రధానమును నున్నది. మచ్చున కొక్కపద్యమునకు తాత్పర్యము వ్రాయుచున్నాను. భగవంతుడు సాక్షాత్కరించిన వెనుక మీ కేమికావలెనని యడుగ "ఇంతవేకువనే నిన్ను నిద్రనుండి లేపి కష్టపెట్టి గోవిందాయను చిన్నపేరుతో బిలిచి యగౌరవపరచితిమి. మే మేమియు దెలియని గొల్లబాలికలము, గాన మాతప్పు మన్నింపుము. ఏడేడు జన్మలందును యనన్యాపేక్షమగు నీపాదభక్తి కలుగునట్టి బుద్ధి నొసంగుము. మా కింకేమియు వలదు." ఎంతమృదువుగ నెట్టి భక్తిభావములతో నున్నదో చూచితిరా. ఈ పావని రచించిన గ్రంథములలో వారణమాయిరమను గ్రంథము సుధామయోక్తులతో స్వభావయుక్తమగు వర్ణనములతో మిక్కిలి యింపుగా నున్నది. చెలికత్తెతో తాను శ్రీకృష్ణుని బెండ్లాడినట్లుస్వప్నముగాంచితినని చెప్పినట్లుండును. ఇట్టి పరమపవిత్రలగు నారీరత్నముల చరిత్రములను మనబాలికలకు పఠనీయ గ్రంథములుగా నేర్పరచిన ప్రాచీనౌన్నత్యమునందు బాలికల కాశజనించును. అటువంటి మహాప్రతిభావంత లుద్భవించిన దేశమునబుట్టి విదేశవిజ్ఞానములకై ప్రాకులాడి రెంటికిని జెడిన రేవడులమై పరిహాసాస్పదుల మగుచున్నాము.

# మాంసాహారము మంచిదా!

శ్రీమతి పాకల చంద్రకాంతామణిగారు

దేవదేవునిచే సృష్టింపబడిన మన కా దేవదేవుడే శరీరధారణకై కావలసిన ఫలములను కందమూలాదులను ఆహారముగా సృజించి యున్నాడు. ప్రకృతిచే నియోజింపబడిన పరిశుద్ధమును ఆరోగ్యకరమునగు నట్టి యాహారము మనము భుజింపజాలక వానిని పచనము జేసి వానియందుగల యుత్తమ గుణములను రూపుమాపి యదియే మిగుల రుచ్యమని భావించుచున్నాము.

సరియే. అనాదినుండియు వచ్చు నిట్టి వాడుకను మనము వదలజాలముగాని పరమేశ్వరుడిచ్చిన ఫలమూలాదులను మాని, శాకములనువదలి, మాంసమును భుజించుట మిగుల హేయమగుకార్యము. మనవంటి జీవమేగల యొకజీవిని కోసికొని దాని మాంసమును భుజించుటెంత యసహ్యాకర మగువిషయమో, యెంత పాపకృత్యమో గమనింపకుండ నున్నారు.

పరమేశ్వరుడు పిపీలికాది బ్రహ్మపర్యంతము నిండియున్నాడు. ఆ కారణముచే మనమే జంతువుల వధించినను ఈశ్వరుని వధించినటులే యగును. కావున దేనిని సంహరింపరాదు. 'అట్లయిన శాకాహారము గూడ నిషేధమే. చెట్లు చేమలు మాత్రము సజీవములుగావా! వానిని భుజించుట ఈశ్వరహింసగాదా!' యని కొందరు వాదింతురు. అట్లయిన మనము నడచుటగూడ పాపమే. ఏలన మనకాలి క్రిందబడి యనేక జీవరాసులు చనిపోవును. అట్లని మనము నడువకుండనుండుటయెట్లు? శ్వాసముపీల్చుట గూడ యయుక్తమే. వాయువునందుగల యనేక క్రిములు మన యుచ్ఛ్వాస నిశ్వాసములచే నలిగిచనిపోవును. అట్లని మనము శ్వాసము నిలుపగలమా? అట్లయిన మనము జీవించుటెట్లు; చెట్లుచేమలకువలెగాక జంతువులకుగల్గుబాధ మనను కండ్లార గాంచగలిగెదము. మానవులకువలెనే వానికి చీమునెత్తురు గలదు. వానిని వధించునప్పుడవి చెందుబాధ తలంచినంతనే కష్టమగుచున్నది. అదిగాక, జంతుమాంస మొకటియు మానవమాంస మొకటియు నగునా? ఏవి భుజించిననేమి! తలచిననే రోత పుట్టించునిట్టిది ఆహారముగ భుజించుట పాపదాయకమగు నిట్టికృత్యము మానుటెంతయు సమంజసము.

వానిని మేము చేతులార జంపినగదా! మాకు పాపమంటును. ఆపాపమంతయు వాని వధించువారికే చెందునని కొందరుయుక్తిపరులందురు. కొనువార లుండుటవలననే గదా నోరులేనిజంతువు లకాలమృత్యువువాత బడుచున్నవి. కొని తినువారలులేకున్న నావధింపబడు జంతువులమాంస మేమి చేయుదురు? దీనిగూర్చి 'జీవబ్రహ్మైక్య రాజయోగ సారామృతము'ను గ్రంథమునం దిట్లు చెప్పబడియున్నది. 'ఓ మాంసభక్షకులారా! మీరు మాంసమును తినుటను

మానినచో వానిని విక్రయించువారికి పని లేక అన్యవృత్తినివదలి యింకొకపనికి ప్రయత్నింపగలడు. అప్పుడు జీవహింసయను పాపకార్యము తప్పక నశించును.' కావున జంతువులను వధించువారలకంటె వాని మాంసమును కొని తినువారలదే హెచ్చు పాపమని గ్రహింతురుగాక!

మరియు మత్స్యమాంసాదులను భుజించుటవలన కామక్రోధాది తామసికగుణము లుద్భవించును. 'శాకాహారులకుమాత్రము తామసికగుణములు లేవా?' యని కొందరు వాదింతురు. పుట్టుకతోడగల్గు గుణముల నెవరు మాన్పగలరు? అట్లని వానిని మరింత హెచ్చించుట భావ్యముగాదు.

'మాంసాహారము దైవనిర్ణయమే యనియు నిందుదోష మేమియు లేదనియు నిట్లుచేయుటవలన భూభారమడంగుననియు కొందరు వాదింతురు. ఇది యెంత సవ్యముగానున్నది? అట్లయిన కనబడిన ప్రతి జీవిని చంపుటయే యుక్తముగాదా? అట్లుగాక మానవు లొకరినొకరు చంపుకొనిన పాపమని తలంచుటయేల? వారిని శిక్షించుటయేల? పరమేష్ఠి ప్రపంచమునందు ఎనుబదినాలుగులక్షల జీవరాసులను పుట్టించియున్నాడు. కనుక అందులో చేరిన వియే మేకలు, కోళ్లు. ఇంతియేకాని మనుజునికొరకవి యెన్నడును సృజింపబడి యుండవు.

"సింహశార్దూలాది మృగములు మాంసాహారులు గావా? అవి దైవనిర్ణయములు గావా? అట్టి మనకుగూడ మాంసాహారము దైవనిర్ణయమే" యని కొందరందురు. ఇది విచారణీయాంశమే. జంతువులను మన మాహారవిషయములో ఆదర్శముగా గొనునప్పుడు వానివలె మానవులు కూడ పచ్చిమాంసమునే భుజించవలసి యున్నది. అట్లుగాక పచనముచేయుటేల? దైవము మానవులకు బుద్ధియను నదియొసంగియున్నాడు. దానిచే మానవులు తక్కిన జీవరాసులకన్న తెలివిగలిగి మెలగుచున్నారు. జంతువులవలె మానవులు దిగంబరులై యుండక వసనములు ధరించుచున్నారు. వానివలె విపినములలో దిరుగక దైవదత్తమగు బుద్ధి నుపయోగించి గృహములను నిర్మించికొని నివసించుచున్నారు. అట్లే పైవిషయములనుబట్టిచూడ మాంసాహారము వర్జనీయమనియు మంచిదికాదనియు తోచుచున్నదికదా! కావున మానవులు దైవదత్తమగు బుద్ధి నుపయోగించి గర్హనీయమును, నింద్యమును, అనారోగ్యకరమును, పాపదాయకమునగు మాంసాహారమును వదలి, శాకాహారులై జీవహింస మాని, నోరులేని జీవులపాలిటి మృత్యుదేవతలుగాక, వాని నకాలమృత్యువువాతనుండి దప్పించి దేవదేవుని ప్రేమకు పాత్రులగుదురుగాక!

# "మేరీ"

"రేణు"

ఆతడొక ఫకీరు

తెండితీగెలగడ్డం విశాలవక్షస్థలం మీదికి ప్రాకుతోంది. ఉతికిన బట్టవంటి ముడుతలుపడిన శరీరం. జీవశక్తిని యీనుతున్న దీర్ఘనయనాలు, విరివిగల నుదురు, పొడుగుపాటిముక్కు—

చేత లాంతరుపట్టుకుని ఆ నిశీథంలో గిలకను త్రిప్పుతూ.

— మీపిల్లల్‌కి
జెల్లల్‌కి
సల్లాగఉండాలి
మీపాడీపంటల్
వృద్ధిపొందాలి...
అల్లాకసాం......

—అంటూ నిశీథం ప్రతిధ్వనించే కంఠంతో పాడుకుంటూ పోతున్నాడు. ఆకాశవీధిని మిణుకు మిణుకుమంటున్న నక్షత్రాలు, చెట్లమీద శబ్దంచేస్తూన్న కీటకాలు, ఊరుబైట కూనిరాగాలు తీస్తున్ననక్కలు, తప్ప మరెవ్వరు ఆపాటని ఆలకించటంలేదు.

బాటప్రక్కనఉన్న మురికికాలువలో కుక్కపిల్ల కూనిరాగాలు తీస్తూవుంది. ఆ జాలిహృదయం కాళ్లను బంధించింది, కంఠాన్ని అరికట్టింది. ఫకీరు తన లాంతరుపైకెత్తి దరికిపోయాడు. చిన్నకుక్కపిల్ల కాళ్లు చేతులు గిజగిజాతన్నుకుంటూ ఉత్కృష్టంపడుతూంది. మెల్లిగా పైకితీసాడు.

* * * *

దానికేం ఉపచారంచేసేడో ఆఫకీరుగాని అప్పటికి ఆకుక్క చాల బలంగాఉంది. ఫకీరుముందు లాంతరు నోటితో కరుచుకొనిపోతుంది ఆకుక్క. ఫకీరు గిలకను త్రిప్పుతూ కంచుగొంతుకతో పాటపాడుకొంటు

: అంకితం :

మేరీవంటి కృతజ్ఞజీవులకు

పోతున్నాడు. ముందు నడుస్తున్నకుక్కను ఆశ్చర్యముగా చూస్తున్నారందరు.

దయగల హృదయాలు ధర్మం చేస్తున్నాయి— కొంతమంది—అడుక్కోటానికి యిదో ఎత్తని పదతిడుతున్నారు.

లోకం తనుగురించి ఏమనుకొంటున్నారోనన్న దిగులే లేదు అతనికి. తనగిలక తాను, తన్మయత్వములో తేలిపోతున్నారు.

అక్కడక్కడ కుక్క లాంతరును క్రిందపెట్టి ఆగుతోంది. పాట పూర్తికాగానె నడకసాగిస్తుంది.

* * * *

ఆరోజు ఫకీరుకి తినటానికికూడ యేమిదొరకలేదు—పోరునవర్షం — తనకుక్క తాను ఒకరిముందు ఒకరు కూర్చుని మూగభాషలో ముచ్చట్లాడుకుంటున్నారు. ఆకుక్క ఉండీఉండీ చటుక్కుని పరుగెత్తుక వెళ్లిందక్కడికో ఆశ్చర్యముతో చూస్తున్నాడు ఫకీరు. ఒకనిమిషాని కల్లావర్షంలో తడుస్తూ పెద్దరొట్టెఒకటి నోట్లో కరచుకొనివచ్చిఫకీరువడిలోపెట్టిందికుక్క. ఫకీరికి వింత, ఆనందం ఒక్కసారికలిగాయి. నోరులేని ఆహృదయం తన హృదయవేదన కారొట్టెతెచ్చినందుకు నివ్వెరపడ్డాడు. కొంచంముక్కవిరచి దానికుందువేసి తానారొట్టెని తుడుచుకొని తింటున్నాడు కాని కుక్కమాత్రం ఆముక్కను అంటకుండా యిదికూడా నీవే తినమన్నట్టుగా సంజ్ఞచేస్తోంది.

మాటలు నేర్చిన ఆకుక్క హృదయంజ్ఞానం తెలియని మానవహృదయంకంటె యెన్నిరెట్లుమేలో!

* * * *



లిన్‌లిత్‌గో సతిగారు

బాలభట సేవికలకు బహుమతుల పంచుట.



మిస్ - వి. జమ్న

న్యూ ఢిల్లీలోని మద్రాసీయుల విద్యాసంఘములో సంగీత నైపుణ్యమునకు 'శ్రీమతి అల్లాడి గోదావరి అమ్మ'గారి ప్రథమ బహుమతిఁబొందెను.

## నిశిరాత్రి

వర్షం కురిసి కురిసి అప్పుడే వదలింది. మేఘాల్ని పొడుచుకుంటూ వస్తున్నాయి చుక్కలు. అక్కడక్కడ వర్షపునీరు గుంటల్లో నిలిచివుంది.

ఫకీరు ఒంటరిగా వస్తున్నాడు; వెనకనీళ్లు చిమ్ముకుంటూ వస్తూంది కుక్క.

అది నాల్గుకోళ్ల మెంగ—అక్కడవరకూ వచ్చి దారితెలియక నిలబడిపోయాడు ఫకీరు—ఒక కానిస్టేబులు వచ్చి ఫకీరిని పట్టుకున్నాడు. ఒక తన్నుతన్ని—'మాదర్ ఛోద్...'అని యేమో అనబోతూండగానే కుక్క పోలీసు పిక్కపట్టుకున్నది. కెవ్వున కేక వేశాడు పోలీసు. ఫకీరు కుక్కను పట్టుకుని ఆపు చేశాడు. పోలీసు జేబునుంచి విజిల్ తీసి ఊదాడు; యింకో పోలీసు తూలుతు వచ్చాడు అక్కడికి; యిద్దరు కలిసి ఆ ఫకీరుని పట్టుకుని స్టేషనుకు తీసుకుపోయారు. ఆకుక్క కూడావస్తే దాంట్లో ఒక పోలీసు కర్ర యెత్తి కొట్టాడు. దూరందూరంగా వాళ్లననుసరిస్తూ స్టేషనుకు పోయింది కుక్క.

* * * *

అప్పటికి మూడురోజులనుంచి రిమేన్డులో ఉన్నాడు ఫకీరు—యెందుకు?

అంతకుముందు ఆఊళ్లో రెండుమూడు చోరీలు జరిగాయి. చోరీని పట్టుకోలేని అసమర్థులు ఫకీరే చోరీ అన్నారు. పాపిష్టిలోకం నమ్మింది కూడాను.

కుక్క గేటుముందున్న రావిచెట్టువద్ద కూర్చుని ఫకీర్ను చూస్తూ విలపిస్తూంది; ఫకీరు లోపలునుంచి పొమ్మని సంజ్ఞచేస్తూన్నాడు పోలీసులు. అనేకసార్లు రాళ్లురువ్వారు ఆకుక్కమీదికి; తిరిగి అక్కడికేవచ్చి ఫకీరు కనబడేటట్టు కూర్చుంటూంది.

ఆరోజు ఫకీర్ను కోర్టుకు తీసుకుపోయేరోజు. నిందుతులతో పోలీసులు ఫకీర్ను రైలుస్టేషనుకు తీసుకొస్తున్నారు. కుక్క దీనంగా విలపిస్తూ వాళ్లను వెన్నాడింది. బండిరాగానే ఫకీర్ని బండి యెక్కించారు పోలీసులు. కుక్కకూడ బండివద్దకువచ్చి పెట్టెలోకి ఉరకపోయింది. పోలీసులు కర్రలతో కొట్టారు రైల్ వేకూలీలు రాళ్ళతోరువ్వి వెదలకొట్ట ప్రయత్నించారు. యెంతకొట్టినా ఆకుక్క అక్కడనుంచి కదిలిందే కాదు.

బండి కదిలింది—కుక్క బండితోకూడా పరుగెత్తడం మొదలుపెట్టింది. రెండుమూడు ఫర్లాంగులు బండితో సరిగా పరుగెత్తింది. ఫకీరు—పోలీసులు—బండిలో ప్రయాణీకులు—ఆతురతతో వింతగా పరీక్షిస్తున్నారు. చాలవరకు పరుగెత్తి పరుగెత్తి ఒకగంతువేసింది రైలుమీదకు తలుపుతగిలి బండిక్రింద పడింది.

యినపచక్రాలు ఆకుక్కను నవిలేశాయి.

ప్రయాణీకులందరు అయ్యోపాపం యెవరిదా కుక్కన్నారు. ఆపెట్టెలోఉన్న ఒక ప్రయాణీకుడు—అసలు ఆకుక్క నాదే—దానిపేరు మేరీ—జబ్బుచేయుటచేత వదలివేశాను—యిప్పుడు దాన్ని యెవరుపెంచుతున్నారో మరి—అన్నాడు.

ఫకీరు 'మేరీ' అంటూ రెండశ్రుధారలు వదిలాడు. బండి శరవేగాన్న పోతుంది.

# కేసరిరత్నములు

రామసుబ్బారాయఁడుగారు బి. ఏ.

ఉ. నీవొనరించుకార్య మది నీతికి ఖ్యాతికి నాలవాలమై
భూవలయమ్మునం దుదయశైలముఁ గొనఁజాలినదై సతంబు మో
దావహమై సతీమణుల కందఱకుం దలలోని నాల్కయై
చేవగలట్టిదై కవులచే నుతిఁగాంచుచునుండె కేసరీ!

గీ. స్త్రీలపాలిట గృహలక్ష్మి చేయుచున్న, సేవ యిట్టిదట్టిదనుచుఁ జెప్పఁదరము
గాదు వేలకొలఁదిగ విజ్ఞానధన్య, లైరి కాంతలెందఱో దీనినందఁబట్టి.

ఉ. భారతదేశమందుఁ జదువంగలవారతిస్వల్పులందు నీ
ధారుణిలోన స్త్రీగణము తద్దయుఁ దక్కువ విద్యలోన న
వ్వారల నెందఱేని సులభంబుగ జ్ఞానులుగాఁగఁ జేసె సు
శ్రీరహి మీరు పత్రికను చే ధరియించుటఁ జేసి కేసరీ!

గీ. చదువు మొగమెఱుంగనివారు చదువ నేర్చి, వ్రాయఁజాలనివారలు వ్రాయ నేర్చి
యొప్పిన కవిత్వమును గూడఁ జెప్ప నేర్చి, రనిన గృహలక్ష్మి పత్రికా ఘనత చెప్ప.

ఉ. చేవఁగలట్టి పత్రికను సిద్ధము చేయుటఁ జేసి కాదె ధా
త్రీవలయంబునందున సతీమణులెందఱొ బుద్ధిమంతులై
చేవఁగలట్టి కైతయును జెప్పఁగలట్టి విశేషప్రజ్ఞకుం
దావలమైరి నీ కలనఁ దక్కువయేమిటి నీకు కేసరీ!

గీ. లోధ్రచేతనె నిన్నెల్లలోకమెఱుఁగు, మేటివైద్యుఁడవంచు నే సాటిలేక
యిప్పుడీ గృహలక్ష్మియే విప్పిచెప్ప, నాంధ్రభాషలో నీకుగలట్టి ప్రజ్ఞ.

గీ. పరమభాగ్యసౌభాగ్య వైభవములెల్ల, నందఁగల్గెడు దివ్యనవ్యభవనంబొ
కండు సమకూర్చినావన్న ఘనతఁ జెప్ప, నీవు గృహలక్ష్మికై చేయు సేవలెల్ల.

ఉ. వేయి వచింపనేల? పృథివీతలమందు ఘనుండవన్న నీ
వే యని గానముఁ సలుపు విజ్ఞతఁ గన్న ప్రపంచమెల్ల నా
దాయము చాలకున్నను సుదారగుణంబది హెచ్చుచుండె బ్ర
హ్మాయువుఁ గల్గునట్లు పరమాత్ముఁడు ప్రోచుత నిన్ను కేసరీ!

# ఘోషా పుట్టుపూర్వోత్తరములు

శ్రీమతి యస్. కె. రాధామణిగారు

---

శ్లో॥ "నగృహాణి నవస్త్రాణి నప్రాకారాస్తిరస్క్రియాః।
నేదృశా రాజసత్కారావృత్త మావరణం స్త్రియాః॥"

(వాల్మీకి)

భారతదేశమున ఘోషాపద్ధతి అనాదినుండి వచ్చిన యాచారము. ఘోషాయనిన గోప్యమని తెలియుచున్నది. ఇది స్త్రీలనే బాధించినది. స్త్రీలయొక్క శీలమునుగూర్చి సంశయించి పురుషులీరీతిగ చేసి యుండవచ్చును. ఈ ఘోషాపద్ధతి పూర్వకాలమున చాల తీవ్రరూపమును దాల్చియుండి, యెక్కువ కట్టుదిట్టములలో నుండెడిది. అధునికకాలమున పాశ్చాత్య విజ్ఞానము విద్య, నాగరకతా సంపర్కముల చేతను నిది కొంతవఱకు తగ్గిపోవుచున్నది. ఘోషాపద్ధతులు చాలవరకు గొప్పవారి గృహములందే యెక్కువ. బీదవారును, కొంచెముగ ధనముగల మధ్యతరగతివారును, జీవయాత్రకై స్త్రీలుకూడా కష్టపడునట్టి సంసారములను ఘోషాపద్ధతి ననలంబించుట లేదు. పరిస్థితులను బట్టి వీరియందు నిర్బంధముగ తొలగిపోయినది. ఈ రీతిగానే అధునిక ప్రపంచమున రైలుబండ్లు, మోటారులు వచ్చియున్న దినములలో సమయానుకూలముగ ఘోషా యంతరించుచున్నది.

చరిత్రనుబట్టి చూచినయెడల ఆర్యులు హిందూదేశమునకు వచ్చినపిమ్మట జాతులేర్పడగ ఘోషాపద్ధతి పెద్ద జాతివారిని ధనికులను ఆశ్రయించినది. అప్పుడది వారిలో గొప్పగౌరవమని తలంచెడువారు. ఇస్లాముమతము హిందూదేశమునకు వచ్చినతరువాత హిందూదేశమున అప్పటికి ప్రబలియున్న ఘోషాపద్ధతినే యిస్లాము మతస్థులలోని ధనిక తెగవారు అనుకరించిరని చరిత్రకారులు చెప్పుచున్నారు.

పూర్వకాలమున ఘోషాపద్ధతి యెట్లుండినది? ఏ రీతిగ నుండినది? అను విషయములకు మనకు ముఖ్యాధారములు పురాణములు, భారతరామాయణాదులు. మనుధర్మశాస్త్రమున ఘోషా నిర్బంధ ఆచరణీయముగ చెప్పబడినది. ఇందుకు కారణము స్త్రీలను నమ్ముటకు వీలులేదట. స్త్రీలు ఒక స్వయంవరమందు తప్ప యితరత్రి బహిరంగముగ చరియింపకూడదట. భారత రామాయణములందు ద్రౌపది, సీత, మొదలగు పతివ్రతలు "రాజదార లసూర్యంపశ్య లౌదుర్గా" అనినట్లు దేవతలకు సయితము కనబడకుండిరట. శ్రీరాముడు వనవాసము పోవునపుడు సీతను వెంటనిడుకొని అయోధ్యాపుర వీధులందు బోవుచుండగ "ఎంతటి కష్టదశవచ్చినది, దేవతలకు సయితము అదృశ్యయగు సీతాదేవి సామాన్యజనుల కంటబడవలసి వచ్చెనే" అని పురజనులు వగచిరట. రామాయణమునందే, శ్రీరాముడు లంకాపురినుండి తీసికొనిరాబడిన జానకిని స్నేహితులతోనున్న తనవద్దకు తీసికొని రమ్మనగ విభీషణుడు చుట్టుప్రక్కలనున్న వారినందఱిని తొలగిపొమ్మని ఆజ్ఞాపించెనట. అప్పుడు శ్రీరాముడు "యుద్ధసమయమునందును, ఇష్టజన వియోగము కలిగినపుడును, కష్టదశయందును, యజ్ఞాది

కార్యములందును, స్త్రీ బయటికివచ్చి కనుపించినను దోషములేదు" అని చెప్పి జనులనందఱి పోవలదని ఆజ్ఞాపించెనట.

మహాభారతమున ధర్మజుడు జూదమందు ద్రౌపది నోడగ ద్రౌపది నిండుసభకుతీసికొని రాబడెను. సభాసదులనందఱిని బిక్కరిచూపులతో చూచి ద్రౌపది "నా స్వయంవర సమయమునందుతప్ప మఱెప్పుడును నిట్టి రాజలోకము నన్ను చూడలేదు. కడకు దేవతలుకూడ నన్నుచూచి యెఱుగరు. దురదృష్టవశమున నన్ను నేడిచటికి విధియే తీసికొనివచ్చినది అయ్యో! రాజులందరును సనాతనధర్మమును పాడుచేసిరా?" అని గద్గదకంఠయై చెప్పినది.

ఇదిగాక నొకప్పుడు కంసుడు కుస్తీపందెములు చూచుటకై వచ్చిన రాచస్త్రీలకు యెత్తైన నొక స్థలమును నిర్మించి దానికంతయు సన్నని వస్త్రమును చుట్టించెనట. ఇంకను కలియుగమున స్త్రీలు, పెద్దవారిని భర్తలను లక్ష్యముచేయక సుందరముగ వెంట్రుకలు దువ్వుకొని ఘోషాఅనునది లేక విచ్చలవిడిగ తిరుగుదురు" అని బ్రహ్మపురాణమున చెప్పబడినది. హర్షచరిత్రమును వ్రాసిన బాణుడుకూడ స్త్రీలు మేలిముసుగు కప్పుకొని తిరిగినయెడల వారి శీలము చాటుచున్నదని నుడివెను. పాశ్చాత్యదేశములందుగూడ స్త్రీలను చెడ్డ స్వభావులనియు వారిని నమ్మకూడదనియుయెంచి వారిని ఘోషాలయందుంచిరని చరిత్ర నిదర్శనములవలన తెలియవచ్చుచున్నవి. దీనినుండి తెలియవచ్చునదేమన, అప్పటివారు స్త్రీలను నమ్మకపోవుటయు ఆకాలమున ఘోషా ప్రాముఖ్యమెక్కువగ నుండెననియు తెలియుచున్నది.

ఇట్లు చాలకాలమునుండి వచ్చినపద్ధతి ఆచారము ననుసరణీయమై యిప్పటికి హిందూమహమ్మదీయులలో, అందును మహమ్మదీయులందు తీవ్రరూపమును దాల్చియున్నది. హిందువులలో చాలమట్టుకు మహారాష్ట్రజాతి వారియందున్నది. వీరియందును చాల వరకు అంతరించినదనియే చెప్పవచ్చును. అయితే మహమ్మదీయులలో అటులకాదు. మహమ్మదీయులలో స్త్రీ లెప్పుడు బైటికి రావలెననుకొన్నను బురఖాలను తొడిగికొనివత్తురు. కొంచెము పెద్దయింటివారు జట్కాబండ్లలోను మోటారులలోను తెరలు కట్టుకొని పోదురు. ఇప్పుడిప్పుడు పాశ్చాత్యనాగరికతా విజ్ఞానముల సంపర్కముచే గొప్పగొప్పవారలే ఘోషాలను వదలుచున్నారు. హైదరాబాదు నవాబుగారి కుటుంబీకులు కొందఱు ఇంగ్లాండు మొదలగు పాశ్చాత్యదేశములందు సంచారముచేసిరి. వారి ఛాయాచిత్రములుకూడ పత్రికలందు ప్రకటింపబడగ చూడనివారందరు చూచిరి. ఇప్పుడిప్పుడు మహమ్మదీయస్త్రీలు సినిమాప్రదర్శనములకును, అంగళ్లయందు వస్తువులను తీసికొనుటకును, విద్యాశాలలందు ప్రదర్శనములకును బురఖాలువేసికొని కొందఱు, వేసికొనక కొందఱు వచ్చుచున్నారు. ఈరీతిగనే బురఖాలుకూడ కొలదికాలములోనే పోగలవు. ఆధునిక విద్యాపద్ధతులనుబట్టియు, సంప్రదాయములనుబట్టియు, నాగరకత ననుసరించియు, అచిరకాలములోనే యీ ఘోషాపద్ధతి అంతరించి స్త్రీజాతికి స్వేచ్ఛరాగలదు. చదువుకొనుచున్న యీకాలపు పిల్లలు ఘోషా పద్ధతి చాల అసహ్యముగ నగుపించుచున్నది. వీరైనను పెద్దవారై ఘోషాలను రూపుమాపుదురని తలచెదను. స్త్రీలకు ఘోషాలు, నిర్బంధకట్టుదిట్టములు శీలమును రక్షింపవు. మంచినడవడి, సత్ప్రవర్తన—ఇవియే శీలమునకు రక్షణ.

# ప్రబోధ సుధాకరము

శ్రీమతి కాళ్లకూరి మహాలక్ష్మీసుందరమ్మగారు బి. ఏ. (ఆనర్సు)

(వెనుకటి తరువాయి)

శరీరమున దోషమును సువ్యక్తముగా నిరూపించి శంకర భగవత్పాదాచార్యుల వారు విషయానుభవమునంగల లోపముల నిట్లు ప్రతిపాదించుచున్నారు.

వట్టి వ్యామోహంబున మూఢుడు బురద పూసుకొనుచున్నాడు. దురదృష్టమను వృష్టిచే తాను పూసుకొన్నమట్టి కఱగి దేహమును గేహమునుగూడ కూలుచున్నది.

తత్త్వశాంతిలేని జీవున కొకవిధమున గాదు చింత. ఒకడు తనభార్య కురూపి యని మనసులో దుఃఖించును. మఱియొకడు తనభార్య యందకత్తెయని దుఃఖించును. మిత్రుడో, భృత్యుడో, చివరకు వాకిట నిలచిన వైరాగివాడో తనభార్య నెక్కడ వశ మొనరించుకొనునోయని యీతడు కుందుచుండును.

ఈ రీతిగా సందమైన భార్యచర్యలకు సదా కోపము ననుభవించుచు భర్త లేశ మేనిసుఖము నొందకున్నాడు.

తెలివితక్కువ పెండ్లాము తనమాట మనసు నెఱుగలేక యొడ్డపనులు చేయుచు శత్రువువలె బుద్ధికి క్షోభ కలిగించును. ఇట్టి మొద్దు పరాభిలాషిణికూడ నయ్యె నేని యీ గేస్తునిపాట్లు దేవుని కెఱుక.

సుతులు లేనివారలకు గతులు లేవందురు. పడరానిపాట్లుపడి, పుట్టకు ధనులుపోసి, ప్రాణాచారములుపడి సుతులంబడసిన వారి కానుతుడేమిచేయునో పుట్టినవాడు బ్రదుకు నాయని చింత. తనకొడుకు జారుడగునో, చోరుడగునో, లోభియగునో, భ్రష్టుడగునో, జూదమాడునో, క్రూరుడగునో, తలిదండ్రుల కన్నము పెట్టునో, పెట్టడోయని యొకొక్క తండ్రి తన కొడుకునుగూర్చి యడలుచుండును. పెత్తనము, పెట్టె తాళముచెవి తన చేతి కెప్పుడువచ్చునా యెప్పుడీ ముదుసలి వాడు కన్నుమూయునాయని యొక కొడుకు చింతించును.

సర్వగుణసంపన్నుడైన కొడుకెక్కడనో కాని దొరుకడు. ఒక్కడట్టివాడు పుట్టినను, వాడు రోగియగునో, యల్పాయుష్కుడగునోయను చింత యుండనేయున్నది.

పుత్రునివలన సద్గతి కలుగునని మూఢు లనుకొందురు. నూర్గురువిదేకులగన్న ధృతరాష్ట్రునకు వారివలన తనకేమి సద్గతి కలిగినది?

అపుత్రకుడైన శుకమహర్షి కేమిసద్గతులు తప్పినవి?

తలిదండ్రులు, కొడుకులు కోడండ్రు, కూతులు నల్లుండ్రనువారు, సత్రములోని బాటసారులవలెకలసి కాలానుసారముగా విడుచుచుందురు. దైవము తిన్నగాఁజూచి పది మందికి మఱియిటులో పంక్తులు సాగుచున్నంతకాలము కట్టుకొని చుట్టుకొని పోవుచుండు చుట్టములందఱు పొట్టలు నిండిన కతమున బట్టులవలె బొగడుచుందురు.

ఏమివేసినను పూడనిపొట్టకై లక్షల కొలది విత్తము సంపాదింపఁజిత్తము ప్రవర్తించుచుండునే కాని కామముతీరదు. ఒక్కగుడ్డి గవ్వయైన జిక్కదు.

చిక్కినను, ధనమున కెందఱవలననో యాపద. రాజులో దొంగలో శత్రులో దానిని గ్రహింతురు. పాపాలెన్నియో చేసి యుపార్జించిన రాజ్యసొమ్ము రాళ్ల పాలు, ఏనుగులపాలు, గుఱ్ఱములపాలు. ఇంతటి రాజయోగ మనుభవించువారికి శాంతి యావంతయేని కానరాదు.

అమాత్య భృత్యవర్గముకలసి ద్రోహమొనరింతురనియో, పరరాజు లెత్తివత్తురనియో, రణరంగమున భంగముకలుగుననియో విసము పెట్టుదురనియో ఏమూల నుండి యేమిచేయుదురనియో రాజులు సంతతము చింతనొందుచుందురు.

సంపత్తువలన శాంతిలేదు. సామ్రాజ్యమువలనను, శాంతి కానరాదు.

— మనోనింద —

ఈమానస మొక్కప్పుడు నవ్వుచుండును. మఱొకప్పుడేడ్చుచుండు. భ్రాంతితో దశదిశలు ధావనము సేయుచుండును. సంతసించుచు, కోపగించుచు, శిష్టవృత్తినుండుచు, దుష్టమగుచు, నిందించుచు, గీర్తించుచు పలుగతుల నడుచుచుండును. పరాపవాదము సేయుచుండును. తన్నుదా బొగడుకొనును.

ఆశతో గూడెనా యీమనసు పిశాచమగును. దంభాభిమానలోభములచేఁ గామ క్రోధ మాత్సర్యములచే మార్గమునబడిన యస్థులకై కుక్కవలె నిట్టటు పరుగెత్తుచుండును.

కాబట్టి శుద్ధమైన విరాగముచే మనసు కోరిన పదార్థములపై నాసవిడువవలయును. కోరికలేని మానసము నిర్వ్యాపారమగును.

— విషయ నిగ్రహము —

అపారమగు విషయ విషములతో నిండిన యీసంసార సముద్రమునందు మానవ శరీరము పడవవంటిది—ఇది కర్మయను ననుకూల ప్రతికూలవాతములచే నిట్టటు గొట్టబడుచుఁ దేలియాడుచుండును. ఈ పడవకు తొమ్మిది రంధ్రములుకలవు. నౌకాపతి యగు జీవుడు మిక్కిలి సోమరిపోతు. ఈ రంధ్రములు మూయక విడిచినయెడల వాని గుండా నీరోడలో నిండి దాని నడుగునకు ముంచివేయును. ఈ చిల్లులు మూసెనా యనాయాసముగా నీపడవ యావలి యొడ్డు చేరగలము. అన్నతే జడదుఃఖాత్మక

మగు నీ సంసారసాగరమును దాటుట కింద్రియనిగ్రహముకంటె సుఖమగు మార్గము లేదు.

తన కందదని తెలిసి పరునిభార్యపై నాసచేసి ప్రయత్నించును. ఈ వ్యర్థప్రయత్నము వలన పాపాత్ముడగుటకంటె మనుజున కేమి మేలున్నది?

కొండెగాండ్రవలన నొరులపైఁజాడీలను, సంతతమొకడు చెవులు దొరబెట్టుకొని వినుచుండును. ఇట్లు వినుటవలన పరుడు చచ్చునా? నొచ్చునా? వ్యర్థముగా మనుజుడు పాప మనుభవించుచున్నాడు.

అబద్ధములు నపవాదములు ననుత్తమ నాలుక పలుకుచుండును. దానివలన నెవరి కేమి హానికలుగును? తాను మాత్రము పాపాత్ముడగుచున్నాడు.

అరనిమిషము తాననుభవించిన సుఖము వలన బ్రతికినంత కాల మాధివ్యాధులనుభవించుచున్నాడు. ఆవిషయానుభవమైన తోడనే దాని బాధయే మిగులుచున్నది.

కావున నేది గ్రహింపదగినది, యేది విడువదగినదియని బుద్ధిమంతుడు లెస్సగా విచారించి, నిశ్చయించి, అల్పసుఖములకై యాసపడాని యనంత దుఃఖమునుండి తప్పించుకొనుచున్నాడు.

బెస్తవాడు వైచిన గాలమందలి ఎఱకై యాసించి చేప ప్రాణములను గోలుపోవుచున్నది. అప్రకారముగా ఆయావిషయము లనుభవించుచు, నరుడు కాలాకృష్టుడై పతితుడగుచున్నాడు.

పామునోట సగముఁజిక్కిన కప్ప చెంత నున్న యీగల భక్షించుచుండును.

అట్టులనే యాయువు చెల్లిపోవుట యెఱుఁగక గ్రుడ్డివాడై జీవుడు విషయములను సంపాదించుకొనుచున్నాడు.

—:o:—

## పతి

గీ. బంధుగణమున్న ధనమున్న భాగ్యమున్నఁ
దనయులున్నను సఖులున్నఁ దల్లిదండ్రు
లున్న సతి కేమి ఫలియించు? నొక్క ప్రాణ
పతియె యిందునునందున గతియగుసుమ్ము.

గీ. ధర్మమెంచి యే కొంచెమోతల్లియిచ్చు
తగవుపాటించి యేమైనఁ దండ్రియిచ్చు
నాత్మజులుకూడ నల్పమీయంగవచ్చుఁ
బ్రాణమర్పించి పోషించు పతికిసరియె?

ఇనుగంటి సరస్వతీదేవి.



# తెలివిగల స్త్రీలు 'టీ' వాడుకనే ప్రోత్సాహ పరచుచున్నారు



ఇంటిలో నందరికిన్ని 'టీ' వాడుక చేయుటచే మీరు బుద్ధివంతులని మాయభిప్రాయము. పెద్దలకెంత ముఖ్యమో యంత పసివారికిన్ని దేహదార్ఢ్యమునకు 'టీ' యవశ్యము. మీ యిండ్లలోను మీ కుటుంబములలోను యీ 'టీ' వాడుక సహజాచారముగా నేర్పడుట సరియైన పద్ధతియని మా నమ్మకము.



"టీ" జేయు క్రమము : శుద్ధమైన వేడినీరు. కొంచెము వేడిచేసిన శుద్ధపాత్ర. ఒక స్పూను 'టీ' యొక్కొకరికిన్ని, మొత్తముగా నొక స్పూను యధికముగాను పాత్రములో వేసి, మరుగుచున్న నీటిని పోయవలెను. 5 నిమిషములు తాళి, కప్పులలో పోసి, పాలు చక్కెర చేర్పవలెను.

## సంసారమునకు తగిన పానము – ఇండియా 'టీ'

# వందేమాతరం

వందేమాతరం గీతము తుదకు శాసనసభలలో సహితము మారుమ్రోగుచున్నది. ఎల్లభారతీయులును దేశమాత దాస్యవిముక్తికై పాటుపడుచున్నారు. తామందరు ఒక్క తల్లిబిడ్డలమని గర్వపడుచున్నారు. చేతులుకలిపి పని చేయుచున్నారు. ఈ ఐకమత్యమునకు కారణమేది? తల్లి. మాతృస్థాన మట్టిది. ప్రతివాడును తన్ను గన్నతల్లిని ప్రేమించవలెను. గర్భము ధరించిన దాదిగా మానవుడు యావనుడగువరకు తల్లి వానిని కంటికి రెప్పవలె కాపాడి వానికొరకై కొన్ని యిబ్బందులకు తాను లోనుగావలసివచ్చినను సరకుచేయదు. వాని పురోభివృద్ధినే కోరుచుండును. మాతృప్రేమ యెన్నటికినినశించదు. మానవునియొక్క గుణాగుణములు వాని తల్లినిబట్టి కలుగుచుండును. బాల్యమందు ప్రతివాడును తల్లి వద్దనే ఎల్లకాలముండుటచే ఆమె గుణములే వాని కలవడును. వానికి ప్రథమగురువు తల్లియే. మాతృదేవతశిక్షణమున మహారాజును, దేశభక్తుడును, ఏకపత్నీవ్రతుడును, శౌర్యవంతుడును కాగల్గిన శ్రీ ఛత్రపతి శివాజీమహారాజే ఇంకొకతార్కాణము. ఇట్టిమహాపురుషులు పెక్కుమంది. అట్టిమాత విద్యావిహీనరైనచో తత్సంతానముకూడా క్రమశిక్షణ లేనిదగును. కనుక దేశము నుద్ధరింపవలెనన్నను, ఉత్తమపౌరుల తయారుచేయవలెనన్నను ముందుగా స్త్రీసంఘమును సంస్కరింపుడు. వారికి విద్యాదానము చేయుడు. మహిళాసంఘ దాస్యశృంఖములను విడదీయుడు. నాడు దేశదాస్యశృంఖలములు తమంతటనే పోవును. కాండమును విడచి కొమ్మలవైపు చూడకుడు. మాతృదేవత జన్మస్థానమగు మహిళాసంఘము నుద్ధరింపుడు. నాడేవందేమాతరమ్మను గేయాలాపనసార్థకమగును.

పి. కృష్ణవేణి.

# ఆంధ్రరాష్ట్రము

దేవతల రాకపోకల దేజరిల్లి
అతులకీర్తినిగాంచె మా ఆంధ్రమాత
నెయ్యమలరంగవారితో పియ్యమంది
పొందెనాధ్యాత్మికంబైన పూర్ణశక్తి.

౨

పాపముల నెల్లబోగొట్టు భద్రగిరియు
దానినానుకపారు గోదావరియును
విరుల వాసించు దండకావిపినవీథి
ఆంధ్రమాతకు చిహ్నాలై యలరుచుండు.

౩

ధర్మమడుగంటిపోయి యధర్మమెప్పు
డచటతలజూపు నప్పుడే యాంధ్రభూమి
ఎన్నదగువారి కడుపారగన్నవారి
బలియొసంగి జగంబు గాపాడుచుండు.

౪

పుణ్యగోదావరీతీర భూములందు
బ్రాహ్మణులు తాము మేల్కాంచి ప్రాహ్ణవేళ
నర్ఘ్యపాద్యాదికంబు లహస్కరునకు
విశ్వకళ్యాణమర్థించి విడుచుచుంద్రు.

౫

కర్షకులయిండ్ల నాగలి కఱ్ఱుజూచి
సాలియిలయిండ్ల రాట్నపు నూలుజూచి
గోపికలయిండ్ల గవ్వపు గుంజుజూచి
యినుపగజ్జలతల్లి దా నేగదిటకు.

౬

ఇటుల బాడుచునుండుదు రింపుమీర
కవికుమారులు నీకీర్తి కన్నతల్లి
తెలియలేకుంటిమమ్మ మీ దివ్యశక్తి
కన్నులను దెరచియికను గాంచవలయు.

౭

గొప్పపదవుల నెంతో చేకొన్నవారు
ఆంధ్రమాతను మఱువంగ నదనుగాదు
ధనము పాడియు పంటయు మనకుగలవు
రాష్ట్రమొక్కటియే లేదు రాణదక్క.

౮

పదవులిల శాశ్వతంబౌనె భవ్యులార
మాతగోడునుదీర్పుడో మాన్యులార
రాష్ట్రపాలనమె మనకు రమ్యముగను
కీర్తిదాయకమగుచును వరలగలదు.

౯

ధనము విద్యయు దానంబు దానికడను
వెదకిచూచిన లేదందు విబుధులార!
మనకన్నిటచిన్నదై మాన్యయగుచు
ఓఢ్రరాష్ట్రము నొప్పు బలాఢ్యమగుచు.

౧౦

కళ్ళికోటావనీశుని కరుణచేత
ఓఢ్రులకుగల్గె రాష్ట్రంబు నొద్దికగను
ఆంధ్రభూమిని లేదొకో యట్టిరాజు
అంచుజూతురు మనలను ఆంధ్రులార.

౧౧

ఆంధ్రులారంభశూరులై యనెడుపల్కు
లనృతముగ మీరు చేయంగ నదనుగాదె
కరము నడుమును బిగగట్టి ఘనతమీర
యత్నమును సల్పి జయమొందు డాంధ్రులార!

పులవర్తి కమలావతిదేవి.

# హాస్పిటల్లో

శ్రీమతి యల్లాప్రగడ సీతాకుమారిగారు

"అతను ఎంత మోసంచేశాడు. పెళ్ళిచేసుకొందాం, పెళ్ళిచేసుకుందాంఅని చెప్పి నా కింత కష్టం తెచ్చిపెట్టి, చివరకు దేబెముఖం వేశాడు. ఏవిధమైన ఇబ్బందీ లేనంతకాలం ప్రేమ ప్రేమఅంటూ కలవరిస్తాడా? పిసరంత అడ్డొకనిపిస్తే ప్రేమనీ, ప్రేయసినీ, మూసీనదిలో వదిలిపెట్టి తన్ను చూచుకుంటాడా? అవును. ఎంతయినా చెయ్యగలడు. ప్రకృతి అతనిపక్షం! సంఘం అతని పూటకాపు!! చట్టం అతని ఇచ్ఛానువర్తిని!!!

గణగణ గణగణమని ఉస్మానియా జనరలుహాస్పిటల్లో సాయంకాలం 4 గంటలకు కొట్టే విజిటింగుబెల్లు మ్రోగుతూఉన్నది. అన్నివార్డుల్లోని రోగులూ ఆత్రంతో తమఆప్తులు వస్తున్నారో లేదో అని చూచేవాళ్లే. ఇక స్త్రీలూ పురుషులూ పిల్లలూ తండోపతండాలు తమబంధువులూ స్నేహితులూ ఇక ఈరోగులను చూడడానికి ఒకళ్లనొకళ్ళ తోసుకుంటూ వస్తున్నారు. ఆగేటుముందు నిలుచబడ్డ ఇద్దరు బంట్రోతులకూ విడాతెరిపీ లేకుండా ఉన్నది వచ్చేవాళ్లమూటల్లో జేబుల్లో తినుబండారాలు గుంజుకోవడానికీ, వినురుపుచ్చుకు ఒకమూలపడవెయ్యడానికీని.

అది రెండోఅంతస్తులో డెలివరీవార్డు అక్కడ అంతా ప్రసవించిన స్త్రీలుమాత్రమే ఉంటారు. అందులో తల్లీపిల్లా సలక్షణంగా ఉన్నవాళ్లను మధ్య హాలులోనూ పిల్లలులేనివాళ్లను వరండాలలో ఉంచుతారు. హాస్పిటలులోకంతా కలకలలాడుతూనూ ఉండేది. ఈ వార్డునీరసంలోగూడ ఒకవిధమైన ఆనందతోనూ, గర్వంతోను తృప్తితోనూ ప్రకాశిస్తుంటాయి ఆబాలింత స్త్రీలముఖాలు.

ఈ హాలులోకూడా విజిటర్స్కు ఏమీతక్కువలేదు. పైగా ఎక్కువగుడానూ. ఇంచుమించుగా ప్రతిరోగినీ చుట్టేశారు ఈబంధువులూ స్నేహితులూను.

ఆపక్కలన్నిటిలోకీ ఒకపక్కమాత్రమే విజిటర్సుతో చుట్టబడకుండా ఉన్నది. ఆపక్కమీద ఒకయువతి...కాదు. మాతృదేవత పడుకొని దృష్టులతో తనను చూడడానికి వచ్చేవాళ్లెవ్వరూ ఈవిశాల ప్రపంచములో లేరని కాబోలును, చూస్తూఉన్నది. ప్రక్కనే ఉయ్యాలతొట్టిలో సముద్రపునురుగులాటి తెల్లనిపొత్తిళ్లలో అప్పుడు విచ్చినబొడ్డు మల్లెపువ్వులాగా ఒకశిశువు "బహుళ కష్టభరితమైన ఈ విశాలసృష్టిలో తన భావిజీవితము ఎలా జరుగబోతుందో" అని ఆలోచిస్తున్నట్లుగా కనులుమూసుకుని పడుకొని కప్పివేయబడ్డ దోమ తెరలో నుంచి కనిపిస్తూఉన్నది.

పాపం!! ఎవ్వరో ఆతల్లి!! వయసు ఆట్టేలేదు. మనిషి చాలా తెలుపుకాదు కాని ఎరుపూపసిమీకలిసిన బంగారుచాయతో ఉంటుంది.



రచయిత

కళ్లు ఆకర్ణాంతాలు కావు గాని అంత నీరసస్థితిలోకూడ మిలమిల్లాడి పోతున్నాయి. తైలసంస్కారంలేని ఆ కేశపాశం సుదీర్ఘంకాదు కాని నల్లగానూ ఎత్తుగానూ అలలు అలలుగాపడి తలగడానంతా కప్పివేస్తున్నాయి. ఆశూన్యనేత్రాలు తెరువబడేఉన్నాయి కాని ఆమె అక్కడ జరిగేసంగతులు ఏమీచూడడములేదు. అనేకవిధమైన పూర్వస్మృతి మార్గంలోపడి అక్కడక్కడి తనజీవిత ఘట్టాలను విషాదహృదయంతో తిలకిస్తూఉన్నది.

అందులో ఒకరంగం!! అదిఒక విశాలమైన భవనపురోభాగం చాలామంది స్త్రీలూ పురుషులూ బహువిధాల రోదనంచేస్తున్నారు. ఆమధ్య ఒకస్త్రీ కళ్లుమూసుకొని నేలమీదపడుకొనిఉన్నది. తనకు మూడేళ్లుంటాయేమో ఆమెమీద ఎక్కి "అమ్మాఅమ్మా కళ్లుతెలూ" అని ఆడుకుంటున్నది. తరువాత వాళ్లంతాకలిసి ఆమెను ఎక్కడికో తీసుకుపోయి "అమ్మ, అమ్మమ్మగారి ఊరుపోయిం"దని చెప్పారు అక్కడనుంచి మళ్ళీ అమ్మ రానేలేదుకదూ...

పాపం! ఆబాలింత ముఖంమీద విషాదమేఘాలు కమ్ముకున్నాయి. రంగస్థలంమారింది. ఇప్పుడు మరొకరంగం ప్రదర్శింపబడుతూఉన్నది. అది ఒక వివాహవేదిక. చాలామంది స్త్రీలూ పురుషులూ పిల్లలూ సొగసైన బట్టలూ విలువైన సొమ్ములూ ధరించి హడావుడిగా తిరుగుతూ ఉన్నారు. ఇల్లంతా ఆనందంతోనూ కోలాహలంతోనూ కొట్టుకుపోతున్నది. తనని కూడ సర్వాంగశోభితంగా అలంకరించి పీటమీద కూచోపెట్టారు. ఆపక్కన వేరొకపీటమీదగొరిల్లాలా ఆకారముకలిగిన పెండ్లికొడుకు పురోహితుడు ఒకటిచెప్పితే తా నొకటిచేస్తూ కూచొని ఉన్నాడు.

కొంచెం ఎడంగా మరి రెండుపీటలు వేసిఉన్నాయి. వానిలో ఒకదానిమీద పండుకోతిలాగా తనతండ్రి పెళ్లికొడుకు వేషంతో కూర్చున్నాడు ఆపక్కన. ఆపక్కపీటమీద సగంవిచ్చిన తామరమొగ్గలాగా ఒక అమ్మాయి సిగ్గుచేతనో దుఃఖంచేతనో తలవంచుకొని కూచున్నది. అప్పటికి తనకు పన్నెండేళ్లుంటాయి. ప్రతిఘటనశక్తి లేదుకాని జరిగే సందర్భములన్ని మాత్రం తెలుసును. ఈ అరవయ్యేళ్ల ప్రాయంలో తన తండ్రికి వలపు పిచ్చిపట్టి ఆ పద్మంలాటిపిల్లను తాను పెండ్లాడి అందుకు కానుకగా తనను ఆవెర్రివానికి ఇస్తూఉన్నాడని తెలుసును. అతనికి-ఆపెండ్లి కొడుకుకు తెలివిలేదు, చదువులేదు, చక్కదనమూలేదు, చివరకు డబ్బూలేదు. అతనికిఉన్న క్వాలిఫికేషను ఒక్కటీ, ఒకచెల్లెల్ని కలిగిఉండడము. తనఈడు పెళ్లికానిపిల్లలతో ఎన్నోఆశయాలు వెళ్లబోసుకునేది. ఇదివరకు తనభర్తకు ఒక పెద్దఉద్యోగం ఉంటుందనీ ఒకపెద్దనగరంలో కాపురం ఉంటామనీ తను బాగా చదువుకొని పెద్దపెద్ద ఉపన్యాసాలు ఇస్తాననీ తన తండ్రి ఎప్పుడన్న చూడ్డానికివచ్చి ఆశ్చర్యపోతాడనీ, ఈమోస్తరుగా. కాని ఏంలాభం, అవన్నీ ఇప్పుడు ఎవరితో చెప్పుకున్నా లాభంలేదు. ఏవిధంగానూ ఈసంఘటన తప్పిపోదు. బంధువులందరికీ కావలసింది పసందయిన భోజనముమాత్రమే. మరికొన్ని ఘడియల్లో ఆచేతనపదార్థం తన జీవనాధారం ఐపోతుంది. తన తల్లిఉంటే తనకిలాటిసంఘటన కల్గేదికాదేమో.

రోగికన్నులు చెమ్మగిల్లినాయి. పాపం ఇదికూడ విచారఘట్టమే.

ఇది ఇంకోఘట్టం.

ఇది పట్నంలో తమబంధువులఇల్లు, ఎదురుగా ఒక అతను కూచోని మాట్లాడుతూఉన్నాడు. అతనికి 24 ఏళ్లుంటాయి. చామనఛాయగానూ సమ ఉన్నతంగానూ కొంచెం పుష్టిగానూ ఉంటాడు. బిల్లిమోరియాలాగా క్రాపు పైకిదువ్వుకొని ముఖం నున్నగ క్షౌరం చేసుకొని కళ్లకు అద్దాలువేసుకొని ఫుల్ సిల్కుసూటులో ఉంటాడు. ముఖమూ కళ్లూ విలాసంగానూ వికాసంగానూ ఉన్నాయి. కుడిచెంపమీద ఒక పెద్దగుంట-చిన్నగా నవ్వినాసరే-ఏర్పడుతుంటుంది.

అతను చెప్పుతున్నాడు ముఖం కొంచెం సీరియస్‌గా మార్చుకొని "ఇలా మీవాళ్లకు ఇష్టంలేదనే సంగతి ముందుగా నాకు చెప్పలేదేం? మీవాళ్ల అందరి ఇష్టంమీద నీవు మళ్లీ పెళ్లిచేసుకొనబోతున్నావనుకున్నాను."

ఆమె వెంటనే జబాబు చెప్పలేకపోయింది. గుండెలు చాలా తీవ్రంగా కొట్టుకుంటున్నాయి. అనేక కష్టములు పడిపడి ఆమె హృదయమూ, ఆలోచనలు చేసిచేసి మెదడూ చాలా అలిసిపోయినవి. ఎంత చిన్నకష్టము పేరు విన్నాసరే, ఆమె హృదయంలో తీవ్రమయిన బాధ పుట్టుతూఉన్నది. మెల్లగా తన తల తీసుకువెళ్లి అతని గుండెల్లో దాచుకొని అతని రెండుచేతులూ తీసుకొని తీవ్రంగా కొట్టుకుంటున్న గుండెల్లో పెట్టుకొని జాలీగా చెపుతూ ఉన్నది. మీవాళ్లు ఎటువంటివాళ్లు అనుకున్నావు. వాళ్లుచేసే ఘాతకాలకు సంఘంలో పలుకుబడి ఉన్నదనే వాళ్ల ఉద్దేశ్యం. నేను ఆ వెర్రివాడిని వదిలివేసి నా హృదయపూర్వకంగా నాకు జీవనాధారంగానూ సహచరుడుగానూ భాగస్వామిగానూ ఉంటాడని తోచిన పవిత్రంగా వివాహంచేసుకుంటానంటే వాళ్లకు పనికిరాలేదు. మా నాన్న - ఆయనకు అరవయిఏళ్లువెళ్లిపోయినవి- ఆయనపాపం నన్ను బలిపెట్టి ఒకఅమాయికం అమ్మాయిని పెళ్లిచేసుకుంటే సంఘం వెలిఅన్నా వెయ్యలేదు. చుట్టాలంతావచ్చారు పెళ్లికి. ఎంతమంచిదనుకున్నావు మాపిన్ని. నన్ను ఎంతోఆపేక్షగాచూచేది ఎంతోస్నేహంగాఉండేది. మావారు గువాళ్లందరిలాగా చిలిపికయ్యాలుఆడుతూ కూచునేదికాదు. నిజంగా అంతబుద్ధిమంతురాలూ, అంత తెలివైనదీ మావాళ్లల్లో ఎవ్వరూలేదు. కాని ఏం

చేస్తుంది. పాపం ఆమె పక్క ఇంటి బాలసుందరంతో వెళ్లిపోయింది. తరువాత ఆమె చెడ్డదని తిట్టేతిట్లు నేను వినలేక పోయినాను.

నా సంగతి కూడా అంతే, ఆ వెర్రివాడికి నేను అవసరం లేను. నాకు అతను అసలే అవసరం లేదు; అందుకు అతన్ని వదలి నేను వేరే పెళ్లి చేసుకుంటానంటే సంఘమూ, మా నాన్న, శిక్షాస్మృతి, వప్పుకోవడం లేదు. చూడూ నేను పెళ్లి చేసుకుంటే మా నాన్నకు అప్రతిష్ఠట. అతను చేసినపనికి ఏమీ చేదే లేదేమో?...

ఈ అవస్థపడలేక అక్కడనుంచి మా పిన్నిగారి ఊరు వెళ్లిపోయి ఇక్కడ మా దూరపు బంధువులు ఉంటేను వచ్చి చేశాను కాని ఏం లాభం? ఇక్కడ ఎవ్వరూ కూడా పెళ్లి చేసుకోవడానికి ఇష్టంపడలేదు. కారణం ఆ వెర్రివాడు జీవించి ఉండడమే. పోనీ కొన్నాళ్లు చదువుకొని స్వతంత్రంగా ఏదయినా ఉద్యోగం చేసుకుందామనుకున్నాను. కాని దశ్శేది. ఇక్కడికి వచ్చిన తరువాత మా నాన్నకు "ఇక్కడ ఉండి చదువుకుంటాను డబ్బు పంపించ"మని వ్రాశాను. ఆయన వ్రాశాడుగదా ఆడముండకు డబ్బు ఖర్చుపెట్టి చదివిస్తానా! తిన్నగా ఇంటికి దయచెయ్యి, లేకపోతే పోలీసుల ద్వారా తెప్పిస్తాను," అని. మెంగకుంక అయిన మా అన్నయ్య గుంటూరులో చదువుకుంటే అతను నెల నెలా వచ్చే డబ్బు తగలేసి చదువుకు బదులు సంకటాలు తెచ్చుకున్నాడు. అవి వదిలేటప్పటికి రెండేకరాల పొలం వదిలింది...

ఈ సోదంతా ఎందుకు చెప్పుతున్నానంటే నాకు మావాళ్ల స్థితి, మనసంఘం స్థితి తెలియజెయ్యడానికి. ఇలాంటి పరిస్థితులలో ఎడారిలో పొయ్యేవాడికి జలాశయం దొరికినట్లు గానూ బంధువుల ద్వారా నీ పరిచయం అయింది. నీవు నా దీనచరిత్ర విని జాలిపడి నేను చదువుకోవడానికి ధనసాయం అయాచితంగానే, స్వార్థ రహితంగానే, చేస్తానన్నావు కాని నాకు మాత్రం నీ దాతృత్వాన్ని స్వార్థరాహిత్యాన్ని చూచిన తరువాత కృతజ్ఞత కలిగి, స్నేహంగా మారి, ఇప్పుడు దుర్నివార్య ప్రణయంగా పరిణమించింది. నీవు కూడా నన్ను గట్టిగా, వివాహం చేసుకుంటానని నమ్మకము చెప్పావు. ఇక ఇప్పుడు ఎవరికి ఇష్టంలేక పోతే నేమి...

అతను చెప్పుతున్నాడు. "నిన్ను నేను మొదట్లో చూచినప్పుడు జాలిమాత్రమే కలిగింది. ఏవిధంగానయినా ఒక అనాథజీవిని ఉద్ధరించితే చాలుననుకున్నాను...

కాని ఆ ఉన్నతాశయాలు చాలాకాలం నిలువబడలేదు. నీలాంటి అనర్ఘరత్నం నా సొత్తు అయితే ధన్యుణ్ణి అనుకున్నాను. నీ జ్యోత్స్నలను వెలిగక్కే కళ్లు, భావాలను రేకొట్టేటట్టూ నన్ను వెర్రివాణ్ణి చేశాయి. చివరకు నిన్నే నా జీవనసర్వస్వంగా చేసుకోవాలనుకున్నాను, కాని ఇప్పుడు చూస్తే మన వివాహం చేసుకోవడం కష్టం అనిపిస్తున్నది. మరి మీవాళ్లకి ఇష్టంలేకపోతే కేసు పెట్టుతారు...

"పెట్టనియ్యి. మనకేమీ ఫరవాలేదు. మన ప్రేమకోసం, మన జీవితోద్దేశ్యం నెరవేర్చేందుకు, సంఘానికి ఒక దోవ చూపేందుకూ, అవసరం అయితే ఇద్దరం చెరి ఒక ఏడాది జైల్లో ఉండివద్దాము. అప్పుడు మన ప్రేమ మరీ ఘనీభవించుతుంది."

"లాభంలేదు. నేను ముందు ఇంత గొడవ ఉన్నదనుకోలేదు. ఈ పెండ్లి చేసుకుంటే ఎలాగైనా మనం నిశ్చింతగా జీవించలేము. ఇప్పుడే ఇంత చిక్కుగా ఉంటే ముందేమి సుఖపడుతాము.

"అయితే ఇంతవరకూ తెచ్చి ఇప్పుడు నన్ను వదలిపెట్టుతానంటావా. ముందు నా స్థితి ఎంత హీనం అయిపోతుందో తెలుసునా?"

"మరేమీ ఫరవాలేదు ముందుపుచ్చుకో, ఇలాగే చదువుకుంటూ ఉండు నీకు కావలసిన ధనసహాయం నేను చేస్తూ ఉంటాను.

"చాలు ఇవ్వాళిటికి నీహృదయం తెలిసింది. అంత విశాలమైన నీగుండెల్లో ఇంతపిరికితనం, ఇంత లోభత్వం ఉన్నదని తెలిస్తే నీసాయం గడ్డిపోచకూడ నేను తీసుకోవకపోదును. నీఛాయ నాగర్భంలో ఉన్నందుకు నేను విచారించుతున్నాను ఇక వెళ్లు, నాఅవస్థ నేను పడుతాను."

నిజముగా ఆ జాలింతరాలిగుండెలు అదిరిపోతున్నాయి. పగపట్టిన తాచుపాముబుస్సలలాగా వేడి నిట్టూర్పులు వీస్తూఉన్నాయి. సహజకాంతాశోభితాలయిన ఆకళ్లు, కెంపుల్లాగా మెరిసిపోతున్నవి.

ఎంత బీభత్సం !!

ఇప్పుడామెహృదయరంగంలోని దృశ్యప్రదర్శనాలమీద తెరదింపబడ్డది. భావివీధిలో పరిభ్రమిస్తూ ఉన్నది.

"చివరకు ఈహాస్పిటలు దిక్కు అయింది నాకు. ఇక్కడమాత్రం ఎన్నాళ్లుంటాను. ఈ వారంకాగానే వీళ్లు కిందికిదింపి వేస్తారు. ఈ హాస్పిటలుగేటుదాటితే నా జీవితాన్ని ఏకార్యక్రమంలో ఉంచాలో తోచడము లేదు. ఈ బయటిప్రపంచంలో నేను కావలసిన వాళ్లుగాని, నాకు గావలసినవాళ్లుగాని ఒక్కప్రాణి కూడా లేరుగదా, ఇక నాభవిష్యత్తు ఎంకావాలో?

"నాలాగే సంఘదురాచారాలకు బలియైన కష్టజీవినులూ, వ్యర్థజీవినులూ ఇంకా ఎంతమంది ఉన్నారో, ఈదేశంలో ఈబాల్యవివాహాలూ ఈ వృద్ధవివాహాలు, ఈఎదురువివాహాలూ ఇంతలో మమ్మల్ని వదలిపెట్టేటట్లు లేవు...పోనీ నాకు చదువుకొనడానికి డబ్బున్నా బాగుండును. మీనాన్నకి అంత ఆస్తిఉన్నదిగదా ఏంలాభం? మాఅన్నయ్యకి తగలవెయ్యడానికైనా అధికారంఉన్నదిగాని నాకుచదువుకోడానికిగూడ అధికారంలేదు...ఇవ్వన్నీ ఇలాఉండగా నాకు మొగుడూఅంటూ ఒకణ్ణిచూపి లేవే కాని 'నా పిల్లను నేను పెంచుకోనరాదుట. రష్యాదేశంలో కాబోలు పెళ్లికాకపోయినా పిల్లలనుకని పెంచుకోనవచ్చు"నని ఆలెడు చెప్పాడు... పెంచుకోనిస్తే నేను ఒక్కపూటనేఅయినా తిని నాచిట్టితల్లిని పెంచుకుంటాను...

ఇక ఆవెర్రివాడున్నంతకాలం నన్నెవ్వరూ పెళ్లిచేసుకోరన్నమాట. నాలుగేళ్లకింద డైవోర్సుబిల్లు కావాలనీ వద్దనీ తన్నుకున్నారు. ఇప్పుడు మళ్లీ కల్లో నన్నఎవరూ అనుకోనడంలేదు. అన్నట్లు ఎన్నికలగోలలొచ్చాయి కాదూ మా స్త్రీలు చాలామంది శాసనసభలకువచ్చారు. వాళ్లేమయినా ప్రయత్నంచేస్తారేమో, ఈశాసనాలకి. ఎబ్బే, ఎందుకుచేస్తారు. వాళ్లజీవితాలు మట్టుకు సౌఖ్యంగాఉంటేచాలు. లేకపోతే "ముందు స్వరాజ్యంరానియ్యండి, తర్వాత ఇవన్నీచూద్దాం" అంటారు.

"పాశ్చాత్యదేశాల్లో వధూవరులకు డాక్టరు సర్టిఫికెట్లు ఉంటేనేగాని పెళ్లిచెయ్యరట. ఈ పవిత్రదేశంలో ఆలాటి గొడవలు పనికిరావు. వీరి జీవితచర్యలన్నీ "కర్మ"నూ "గీత"నూ పట్టి ఉంటాయి కదూ."

"ఆతను ఎంత మోసంచేశాడు. పెళ్లిచేసుకొందాం, పెళ్లిచేసుకుందాం అని చెప్పి నా కింత కష్టం తెచ్చిపెట్టి, చివరకు దేశముఖం చేశాడు. ఏవిధమైన ఇబ్బందీ లేనంతకాలం ప్రేమప్రేమ అంటూ కలవరిస్తాడా? పిసరింత అడ్డుకనిపిస్తే ప్రేమనీ, ప్రేయసినీ, ముసీనదిలో వదిలిపెట్టి తన దోవ తను చూచుకుంటాడా? అవును. ఎంతయినా చెయ్యగలడు. ప్రకృతి అతనిపక్షం! సంఘం అతని పూటకాపు!! చట్టం అతని ఇచ్ఛానువర్తని!!!

"చివరకు ఏమి చెయ్యడానికీ తోచడంలేదు. ఇతరులు ఇచ్చిన సలహాలు ఏమైనా అక్కరకు వస్తాయా అంటే......"రామా కృష్ణా అనుకుంటూ పడిఉండరాదూ" అని ఒకముసలమ్మ నీతి నేరిపింది.

“ఏ సేవాసదనంలోనన్న చేరి పొట్టబోసుకొని సంఘసేవ చెయ్యరాదా” అని ఒక సంస్కారప్రియురాలు బోధించింది.

“పోనీ. బ్రతికి ఎవరిని ఉద్ధరించను. ఎందులోనన్నా పడి ఛావరాదూ” అని ఒకతల్లి ప్రేమపూర్వకంగా సలహా చెప్పింది.

“మా ఇంట్లోఉండి మా నలుగురికీ వండిపెట్టి నీ కడుపుకు ఇంత తినరాదూ” అని గంపెడురోగాలతో కొట్టుకుపోతూవున్న ఒక ఇల్లాలు ఆదరించింది. నిజమే! అన్నిసుఖదుఃఖాలూ అనుభవించి తనజీవితం మీద తనకే అసహ్యంవేసే వీళ్లిచ్చే సలహాలుఇవి...

ప్రక్కనున్న ఉయ్యాలతొట్టిలోనుంచి యాఁయాఁ అని ఆ పసికూనఏడుపు పిణాస్వనంలాగావచ్చి ఆ మాతృహృదయంలో చొచ్చుకుపోయింది. టక్ టక్ మని బూడ్సుల శబ్దంచేస్తూ ఒక సిష్టరువచ్చి ఆబిడ్డను అతినున్నితంగా తీసిదీసి ఆమె పక్కనఉంచి ‘పాలు తాగించు’ అంటూ క్షణం ఆలస్యంచెయ్యకుండా అవతల ఏడుస్తూఉన్న మరొకపిల్ల దగ్గరకు వెళ్లిపోయింది. ఆశిశువు సంపెంగపువ్వులాటి తన చిట్టినోటితో పాలకు తడుముకొనటంచూచి ఆ తల్లిహృదయం ఆర్ద్రింఅయి క్షణం ఆలస్యంచెయ్యకుండా ఆ ప్రణయఖండాన్ని హృదయంలో చేర్చుకున్నది. ఒకక్షణం జరిగిపోయిన విషాదచరిత్రనుగూర్చిన ఆలోచనగాని అంధకారమయమయిన భవిష్యత్పథాన్నిగూర్చిన విచారంగాని ఆమెకు తట్టలేదు.

ఆమె జీవితంలో అది ఒక్కటే ఆనందమయ దివ్యక్షణం!!

గణగణగణగణమని చెవులు రింగుమనేటట్లు 6½ గంటలకు విజిటర్సును వెళ్లిపొమ్మని క్లోజింగుబెల్ మ్రోగుతూఉన్నది.

—:o:—

# వ్యాసకర్తలకు

వ్యాసములు ప్రకటన కంగీకరింపబడుచో వ్యాసకర్తల కా సమాచారము వెంటనే తెలుపబడును. అంగీకరింపబడని వ్యాసములు ఆ మాసాంతమువఱకుమాత్రము భద్రపరుపబడియుండును. వ్యాసములు కావలసిన ఆ యావ్యాసకర్తలు తగు తపాలబిళ్లలనుపంపి వానిని తెప్పించుకొనగలరు.

సంపాదకుడు.

# తెలుపు – నలుపు

.............................................................................

శ్రీ విద్వాన్ విశ్వనాథనరసింహముగారు బి.ఏ. బి.యిడి.

తెలుపు, నలుపు, అనే రెండు రంగుల్లోను చాలామందికి తెలుపుమీద హెచ్చు మోజు. అయితే తెలుపులో అనేకరకాలున్నాయి. పాలమీగడలాంటిదో తెలుపు. ఏనుగు దంతంలాంటిదో తెలుపు. పాలసముద్రంలో లక్ష్మీదేవి పుట్టిందని ప్రసిద్ధం. శారదాదేవి శ్వేతచ్ఛాయగలదనిన్ని, నారదమహాముని కూడా తెల్లనివాడనిన్ని సుప్రసిద్ధమయిన విషయాలు. తెల్లనివాడు చంద్రుడు. అయినా అతనికో కళంకంవుంది. అదే నల్లటిమచ్చ అంటారు. ఆమచ్చ విషయమై చాలా సందేహాలున్నాయి. ప్రేమోన్మాదం వల్ల కల్గినశాపమని కొందరంటారు. తక్కటి విషయాలకేమి. అయినప్పటికి

"ఏకోహి దోషో గుణ సన్నిపాతే
నిమజ్జతీందోః కిరణేష్వివాంకః"

అని అతన్ని సమర్థించాడు కవితల్లజుడైన కాళిదాసు.

కవిసమయం ఏమంటే కీర్తి తెల్లనిదని, అపకీర్తి నల్లనిదనిన్నీ, కీర్తిచంద్రికలు వ్యాపించాయని వ్రాయటం కవుల సంప్రదాయం. మరిన్నీ శారద నీరదములు శ్వేతచ్ఛాయగలవని, ప్రావృట్కాలాంబుదములు కృష్ణవర్ణంగలవనిన్ని, ఇంకా సుఖదుఃఖముల్లో రెండోదాన్ని విషాదమేఘముల నిరూపిస్తూ తద్వారా విషాదం నల్లగావుంటుందని రంగుకల్పించి చెప్పటం వాడుకలోవున్న విషయం. కాగా విషాదం హెచ్చయిపోయిందంటే బాష్పవృష్టి కురుస్తుంది.

తెలుపుకన్న నలుపురంగే ఎక్కువ శక్తిమంతంఅని వూహించాలి. ఎంచేతంటే తెలుపు నల్లగాచేయుటం సులభసాధ్యంకాని నల్లటి ఎలుగుగొడ్డుతోల్ని ఎన్నాళ్లు ఉదికినా కాని తెల్లబడదంటారు. "బొగ్గుపాలగడుగ బోవునా మలినంబు"అన్నాడు వేమన్న. జగత్తులోవున్న నలుపులన్నింటినీ తెల్లగాచేసి నీడల్ని మాత్రం తెల్పు చెయ్యలేక సాంద్రచంద్రిక తుహిన బాష్పములు కురిసింది అన్నారు మనతాతగారు.

ఇక ప్రేమవిషయంలో చెప్పటానికి వీల్లేదు. తెల్లగా దంతంబొమ్మలాంటిబాల, చామనచాయగల యువకుణ్ణి ప్రేమిస్తుంది. మాంచి స్ఫురద్రూపియైన పురుషుడు నల్లకోరివిలాంటి దేవీమూర్తిని వలచి ఆరాధిస్తాడు. ప్రేమ వట్టిగుడ్డిదంటారు కొందరు. శరీరకాంతితో సంబంధం ఏముంది, హృదయాన్ని హృదయం ప్రేమిస్తుందని ఆధునికుల అభిప్రాయం. సామాన్యంగా నల్లగావుంటారుగదా పురుషులు—అందులో మనదక్షిణ దేశంలోను. అయినా వారందరికిన్నీ అప్సరసల్లాంటి వధువులుకావాలని వారి వూహ. కాని అల్లా అందరికి దొరకటం తటస్థించదు.

మాయింటిప్రక్కనేవున్నఓ ఆవిడ ఏమన్నా దంటే ఆమె నల్లటిపిల్లనిప పెళ్లికొడుకు నచ్చలేదట. కడపటఓ బీదకుటుంబంలో వాడు పాపం కట్నానికాశపడి ఆమెను పెళ్లాడాట్ట కాలంవస్తే కర్రిగేదెలేనా బాగుంటాయి గదాఅని మనస్సు సమాధానంచేసుగుని. ఇప్పుడు చాలా అన్యోన్యంగావున్నారు ఆ దంపతులు."జానకీపతి"నల్లనివాడు."జానకి" తెల్లటిపిల్ల. అయితే వలపు నిలిపినవరుడు నలుపై తేమాత్రం ఏమీలోటులేదని సమాధానం చెప్పిందామె. జగన్నాటక సూత్రధారుడైన శ్రీమన్నారాయణుని "నల్లనివాడు పద్మనయనమ్ములవాడు"అని వర్ణించేడు భక్తాగ్రేసరుడైన పోతన్న.

ఇప్పటి ప్రపంచంలోని జనులందరూ తెల్లజాతులు తదితరమైనరంగుల జాతులు అని రెండు విధాలుగా స్థూలమైన విభజనచేయబడినారు. అందులో తెల్లవారికి తెల్లవారిమీద ఎక్కువమక్కువ. అంతేకాకుండా నల్లజాతులమీద మత్సరం, ద్వేషం, కూడాను. నల్లజాతులనగానే ముఖ్యంగా స్ఫురణకు వచ్చేవారు నీగ్రోజాతివారు. వార్ని తెల్లజాతులవాళ్లు ఏవిధంగా హింసించి వశ్యం చేసుగున్నారో చరిత్రలో వ్యక్తం చేయబడింది. నిన్నమొన్నటి అబిసీనియా యుద్ధంవల్ల జాతిమీదికి తెల్లజాతివారి ఉద్ధృతంతప్ప వేరేమీకాదని సర్వలోకవిదితమైంది సాకులకేమిలెండి. పాశ్చాత్యులందరూ సామాన్యంగా తెల్లజాతులకే చెంది వున్నారు. వారల్లావుండడాన్కి శీతోష్ణస్థితి తప్ప మరేమీకారణం లేదు. ఆ దేశాలు సమ శీతోష్ణమండలంలోనూ, లేక శీతలమండలంలోనూ వున్నాయి. ప్రాచ్యదేశాలు భూమధ్యరేఖ దగ్గరగావున్నాయి. అందులోనూ కొన్ని ప్రదేశాలు మిక్కిలి సమీపంగా ఉండటంబట్టి ఆచోట్ల జనులు నల్లగా వున్నారంటే ఆశ్చర్యం ఏమీలేదు.

తెల్లజాతుల్లో చాలామంది క్రైస్తవమతస్థులు. ఆమతంలోకూడా అనేక రకాలున్నాయి. వారు ప్రయత్నించి ప్రచారం చేసి నల్లజాతులవార్ని అనేకుల్ని క్రీస్తుమతంలో కలుపుగున్నారు ఫాదిరీల సేవకేనా పనికి వస్తారుగదా అని. అల్లాచేరిన వారిలో ఎక్కువమంది వారితో సమానులమయ్యామని గర్విస్తారు. కాని ఎన్నోభేదాలున్నాయని మతం స్వీకరించినప్పటికిన్నీ తెల్లవారు తెల్లవారే, నల్లవారు నల్లవారేఅని తెల్సుగున్నవారు చాలామంది పదంపడి పశ్చాత్తాపంపడుతున్నారు. ఆర్యసమాజం మన దేశంలో వారికి కొంతశాంతి కలిగిస్తోంది.

ఇప్పుడు మనప్రభుత్వం ప్రబలంగావున్న ప్రజాసంస్థఅయిన "కాంగ్రెసు'వారి యాధీనంలోవుంది గదా ఈవరలో నల్లవారని హేయంగా చూచే తెల్లవారికి కొంచెం మనస్సంకటంగావుంది వీరి ప్రభుత్వం. సైప లేనివారు కొంతమంది వారి దేశాన్కి వాడెక్కేరు. మనసు ఎల్లాగో సమాధానం చేసుగున్నారు తక్కటివారు.

తివ్వతీస్తే డొంక బయులడ్డట్టు చాలా దూరంవచ్చేము. విరమిస్తాము.

# మార్గో ఆస్క్విత్తుదేవి స్వీయచరిత్రమున

శ్రీ ఒంగోలు వేంకటరంగయ్యగారు

[ ఈమె ఇంగ్లాండులో మహాప్రసిద్ధులగు నీకాలపు బారిష్టరులలో నగ్రగణ్యులును ఐరోపా మహాసంగ్రామమునకు (1914–1918) ముందును సంగ్రామకాలములో కొంత వరకును లిబరల్ కక్షిపక్షమున దాదాపుపదేండ్లు బ్రిటిషుసామ్రాజ్య ప్రధానమంత్రులుగను కీర్తిజెందిన ప్రభు ఆస్క్విత్తు మహామాత్రులభార్య. ఈమె కన్యానామము మార్గరెటు టెనెంటు. ఇందు "మార్గరెటు" అనుభాగము నామకరణనామము. "టెనెంటు" అను భాగము పిత్రువంశనామము. "కామాక్షమ్మ"కు "కాము"అని వాడుకపేరున్నటుల "మార్గరెటు" "మార్గో" యని సంక్షేపింపబడినది. "మార్గరెటు" అనగా గ్రీకుభాషలో "మంచిముత్యము" అనే రీయమకన్వర్థముగ నున్నది. ఐరోపీయుల గృహ్యావిధాన సంప్రదాయములనుబట్టి వివాహితయగు స్త్రీ పిత్రువంశనామమునువదలి భర్తృవంశ నామమును తన బారసాలనాటిపేరునకు చేర్చుకొనును. అందుచే నీమె మార్గరెటు ఆస్క్విత్తు అయినది. హిందువులలోనను పెండ్లియైనస్త్రీ పుట్టునింటిపేరువదలి అత్తగారి యింటిపేరును పెట్టుకొనుచు పిత్రుగోత్రముననుండి భర్తృగోత్రమున జేరుచున్నది. ఇపుడిపుడు హిందువులలోనను కొందరు స్త్రీలపేళ్లకు భర్తృనామములు, భర్తృకుల బిరుదనామములు చేర్చుట కానవచ్చుచున్నది. లేడి ముత్తుస్వామిఅయ్యర్, లేడి భాష్యం అయ్యంగార్, సరోజినీనాయుడు, ముత్తులక్ష్మిరెడ్డి ఇత్యాదులు. ప్రాచీనాచారము లుత్పన్నమై ఇట్టివే పరిపాటియగును కాబోలు. వేదపురాణేతిహాసములందు పెండ్లిఅయినస్త్రీలకును పిత్రన్వయము నిలిచియుండినది. గార్గీ, మైత్రేయీ, జానకీ, మైథిలీ, ద్రౌపదీ, భైష్మీ, భైమీ

1917 సం॥రమున నాకు రాలుకాలము చాలవరకు కడచినపిదప నొకనాడు నేను (మార్గోదేవి) విల్టుషైరు నుండి లండనుకు ప్రయాణముచేయుచుంటిని. ఆనాటి పగలు చాల యుక్కగనుండినది. నే నొంటిగనుంటిని. మొదటి మజిలీకడ నా బండిలోని కొక మాన్యురాలగు స్త్రీ ప్రవేశించినది. ఆమె యుడుపులనుండిన నీలంపు టూర్ణియొక్క తొలకరింపును, ఆమె విలాసంపు కనుగవయు వారపువిడుమక నామె నదీవిహారమున గడుపబోవుచున్నదని సూచించినవి. తెల్లని టోపి, ఇంపగుమొదలిచాయ ఒక ముదలర్రైనలేని ముఖ విలాసము.

ఆమె మెడచుట్టును మంచిముత్యములుండినవి. తెలుపుమీద తెలుపుమించిన కాలిజోడును అందమగు మేజోడును ధరించియుండినది. ఆమె తన ఉన్ని చొక్కాయి జేబుల దడువ మొదలుపెట్టినది. ఆటుపై స్వర్ణఖచితమగు తన చేతిసంచిలో. అంతట నామె తన పావడాను విదిలించుకొనగ నామె చేసంచి క్రిందవడినది. ఆమె యెంత ముద్దుగను ఉటంకిదనము గలదిగను నుండెననగ నామెతో మాటలాడకుండుట పట్టి మురకతనమగునని నాకు తోచినది.

ఆమె సంచిని నేను పైకెత్తియిచ్చుచూ "మీ టికెటు పోగొట్టుకొంటిరా" యంటిని.

# నొక యువాఖ్యానము

## అనువాదకులు

ఇత్యాదులు. ఈప్రాచీనాచారము ఇవు డనుష్ఠానమున నగపడదు. సుబ్బ వెంకశబ్దముల మీద నపత్యార్థకతద్ధితముల సాధించిన నాపేళ్లు ఎట్లుంనోడు?

ఈ మార్గోదేవిగారు భర్తగారి కనురూపమగు విద్యాతిశయము కలవారు. అయ నయవిచక్షణయందును సమర్థురాలు. పార్లమెంటు ప్రవేశములోనగు స్వాతంత్ర్యసంపాదనా విషయములందు ఈమె యేమాత్రమును భర్త్రుల్లంఘనము దోపనీక ప్రాణేశ్వరునితో పోరాడి స్వదేశస్త్రీ స్వాతంత్ర్యముల కెక్కుడు సాయపడినది. ఈమెయందు స్వజాత్యభిమానమును స్వదేశాభిమానమును మిక్కిలి ప్రకాశించుచున్నవి. ఈపురంధ్రి తనచరిత్రమును ఇంగిలీషున 'పెగ్గీ ప్రణాళిక'లో రెండుసంపుటముల గ్రంథముగ బ్రకటించినది. ఈక్రిందనుండు నుపాఖ్యానము రెండవసంపుటమున నున్నది. పైజెప్పిన మహాయుద్ధ కాలమున నీమెయు స్వదేశపక్షమున యుద్ధసంబంధ సేవాధుగ్నురాలయి యుండినది. ఆయుద్ధము జరుగుచుండుకాలమున నొక సెలవుదినమున నీమె రైలులో లండనుకు పోవు చుండగ మార్గమధ్యమున ఈమెబండిలో నెక్కిన యొక అమెరికాయువతికిని ఈమెకును జరిగినసంభాషణయే ఈ యుపాఖ్యానము. దీనివలన ఐరోపీయస్త్రీల మనోభావములును మర్యాదలును నెట్టివిగ నుండునదియు కొంతవరకు గోచరింపగలదు. ఈసంభాషణము మూలములో నున్నటులనే సాధ్యమగునంతవఱకు ఉత్తమపురుష ప్రయోగముననే వ్రాయబడినది. ఇంగిలీషుమూలములోని చతురత తెలుగున జూపుట కష్టముగానున్నది.]

అమెరికను యువతి:—అట్టిదేమియు లేదు. మీరు నాయెడల చాల దయ జూపితిరి. కోరిన వస్తువు లన్నియు అమ్ముచుండు ఒక బెల్జియమువారి యంగడి అడ్రసును పోగొట్టుకొంటిని. అయితే దాని తిరుగ తెలుసుకొనగలను లెండు.

ఇట్లని ఇనుమడించిన ఆత్మధృతిని తెలుపు చిరునగవును నామెచూపి "అబ్బా! ఈ అభాగ్యులు! అన్ని దుండగములే! మీకును తెలిసినవే. వారి కొకరు ఎంత సాయపడగలరు, అంతయును ఇవి చేయింపగలవు. మీ యభిప్రాయము లెట్టివియో నే నెఱుగను గాని, ఈ జండాలు, ఈ ముత్యాలసరాలు, ఈ బొమ్మలు, [1]ఈ వారాలు—! నాకు విసుగెత్తుచున్నవి. దానధర్మముల మిషకల ఈ పెదబొబ్బల నే నెంతయు సహింపజాలను."

---

1 మనదేశమున దీపావళి విక్రయములు, పెద్దపండుగ విక్రయములు, సంవత్సరాది విక్రయములు, ముక్కోటి విక్రయములు అనినట్లు ఐరోపీయాదేశములందు క్రిస్టుమసు విక్రయములు, ఆదివారపు విక్రయములు ఇత్యాదిపేర్లతో పెద్దపెద్దవిక్రయములు జరిపింతురు. వాని ప్రకటనలకై జండాలు, రంగుకాకితములు, పెద్ద అచ్చుకాకితములు ప్రకటింతురు.

నేను—అది నిజము. ఈ జండాలవారాలు ఎంతో గొప్ప మొత్తముల పోగుచేయుచున్నవియో మీ రూహింపజాలరు. చేసిన కృషికి తగిన ప్రతిఫలము కలుగుచునేయున్నది.

ఆ—ఈ ఆర్టలుమార్గమున నేను గడుపుచుండు నంతకాలము మీరును గడుపునెడల [2]రేడింగుస్టేషను వద్ద గ్రుడ్లఅమ్మకమున వచ్చేపైకము మీకు భ్రమ పుట్టించగలదు.

నేను—(మెల్లగ) మీకు పల్లెటూళ్లపై శ్రద్ధ యున్నట్లు తోచుచున్నది. కాదేమి?

ఆ—ఈ పల్లెటూళ్లందురా? మరేమున్నది. వీనిపై నాకు వెఱ్ఱిమసులు పుట్టినది. ఏటిమీద కొంతపోగా అక్కడ నా కొక చిన్నయిల్లున్నది. అంత బూటకపు వస్తువు నింకొకదాని మీరు చూచియుండరు. రైలు మీద అక్కడికిపోవడము రావడములోననే నా ప్రొద్దంతయు గడిచిపోవుచున్నది.

నేను—దానిమీద మీ కింకను విసుగెత్తినట్లు లేదు. ఆదివారముల నన్నిటిని నేను పల్లెటూళ్లయందే వినోదించుచు గడుపుచుండును. అయినను వాని వలన నా కంత విశ్రాంతి కలుగుచున్నదని చెప్పజాలను.

ఆ—(కొంచెము తత్తరపాటునుజూపు అంగీకారములో) మరేమి లెండి.

నాసింగారపు గొడుగుకఱ్ఱకు వేసియుండు పవడంపు పొన్నును చూచిచూచి ఆమె బిగ్గరగ నిట్లనెను:

“ఓహో ఎంతచాలాకి. మీరును నావలెనే రెల్లపుడు పల్లెటూళ్లకు పోవుచుందురు. నా యాటవిడుపు దినము అయిపోయినది. నేను ఇపుడు పిచ్చెత్తినట్లు కొలువునకు చేరవలసియున్నది.”

ఆమెయు నెద్దియైన యుద్ధసంబంధకృత్యముల జేయుచున్నదా యను నూహతో మందస్మితవీచీతరంగితమగు నా మోమునుజూచుచు తొందరతొందరగ నేను “బహుజనము వారివారియాట విడుపుకాలమును అగస్టునుండి జరపుకొందు రనుకొంటిని.

అని మఱియు రహస్యముల దెలిసికొనవలయునను యాతురత గానరాకుండ “ఆట విడుపుదినములగూర్చి యిపు డెవరు పలుకగలరు?” అంటిని.

ఆ—యుద్ధపుపనుల చే నేమియు చేయుటలేదని చెప్పవెరచుచున్నాను. ఒక క్రొత్తనాటకమున నొద్ది కలక్కై నేను లండనుకు పోవుచున్నాను.

నేను—ఓహో! మహాసంతోషము. మీరు నటకులా? నటకురాలుగ నుండవలయునని నేనును పలుమారువిక్ష్లూరితిని.

ఆ—ఈవిషయమున నాకు చాల తొట్రుపాటు గలుగుచున్నది. ఇంగ్లాండున నాడుటకు నా కిదియే మొదలు.

నేను—మీ రమెరికావారా?

ఆ—ఆ! అవును. నా యాసవలన మీ కిది తోచ లేదా?

నేను—మీ యుడుపులనుబట్టి నే నిట్లుహించి యుండవచ్చునుగాని మీ రంతగ దేశవాళియాసతో మాట్లాడుటలేదు.

ఈమాట కొంచెము ములికగానుండునని నాకు తోచి మరల నిట్లంటిని:—నా యుచ్చారణ మీకును చోద్యముగ కనుపడియుండవచ్చు ననుకొనెదను.”

ఆ—(నాయందొక విహ్వలతనుకనుగొని) మనోహరమగు మీపలుకు సవ్వడివలన మీరును నటకురాలుగ నుండియుందురని నేనిపు డనుకొనుచున్నాను.

పైమాటలవలన కొంత పొగడ్త పొందినట్లు నేను సంతసించి “మీరు ఇంగ్లాండునకువచ్చుటకు ఇదియే నా మొదటిసారి—”

ఆ—ఇదియే. ఇచ్చట మీరందరు చాల ఇంపు

2 లండనుపట్టణము సమీపమున నొక చిన్నపట్టణము.

గొల్పుచున్నారు గాని కొన్ని విషయములలో మీ యందు కొన్ని క్రొత్త లగుపడుచున్నవి.

నేను—(ఆమెను వ్యామోహపరచి) మాయందు క్రొత్త లెవ్వివియో కొంచెము చెప్పుదురు.

ఆ—మీ మగవారియందంతయు మాకు క్రొత్తదే. మీ రాచకార్యములా!......

నేను—ఇతరులకు మీ రాచకార్యములును క్రొత్తలును వింతలునుగనున్నవి. మీరు పెనుజిక్కు యుద్ధములోనికి దిగినారు. మీ ప్రెసిడెంటుగారును మీ రాచకార్యములును మీ దేశములోనివానికంటె మంచివియని గాని చెడ్డవియని గాని నేను తీర్మానించను గాని మీ దేశములో మీరు డిమొక్రసి[1] యని త్రుళ్లుచుందు రేయది ప్రపంచ మిదివర కెఱిగిన అన్ని ఆటొక్రసిల[2]కంటె భారముగనున్నది.

ఈమాట లా అమెరికాయువతికి బోధపడనట్లు తోచి నేను ఆయువతి ఆశ్రయించియుండు వృత్తిననుసరించియే ప్రసంగింప నిశ్చయించుకొంటిని. ఇంతలో,

ఆ—అదేమి! రాచకార్యములందే నా కభిరుచి. మీ దేశములో నేను చూచిన మహాచోద్యములగునవి యెవ్వియనగా: మీ రాచకార్యములు. మీ రాచకార్యములు. మీ రాచకార్య ప్రవర్తకులు. ఈవాటి ఈ క్రొత్తగవర్నమెంటువారియం దేమిచూచిన నంతయు మూడారుదెల్లగనున్నది. నేను వినినదంతయు ఇంతకుముందుండిన గవర్నమెంటులోని మంత్రివర్గ మెంత పెద్దదిగనుండినదనగ, వారిలో కొంద రేమి చేయుచుండినదియు మిగిలినవారికి తెలియనే తెలియదట. ప్రధానమంత్రిని తాను ఎన్నడును చూడలేదని లార్డు చేంబర్లెను ఒకనితోననగ నాతడు వాస్నేహితు డొకనితో జెప్పెను. మరియు మంత్రివర్గములో సగముమందిమంత్రులు ఆ లేబరుమంత్రి పేరు హాగో - బోరనో ఇంకేమియో గాని వాని కంటజూచినదే లేదట. అయితే ఆస్క్విత్తు[3]-

ఈపట్టున ఆమెధోరణి కడ్డము వేయవలయునను నుద్దేశముతో నేను కిటికీతలుపును పైకెత్తితిని గాని ప్రయోజనము లేకపోయినది. అమెరికాయువతి ఇంకను ఇటులనినది:—

ఆ—యూరోపులో పెద్ద మెదడులు గలవా రెవరెవరు చెప్పుమా? మీ రెవరెవరిని పేర్కొనుదురో యని నాకు వింతగనున్నది.

అంతట నిలుపక తన పట్టుదల నిలద్రొక్కుకొని ఇటుల రొదుకొలినది. "జరుగు సంగతులలో తుగ తెలిసినవారు నా కిటుల జెప్పిరి:—క్రూపుల[4] వలన ఆస్క్విత్తు మహాధనికుడయినాడనియు ఆయన కుమారిత యెలిజబెత్తుకును ఒక జర్మను అడ్మిరలుకును[5] నిశ్చితార్థ మైనదనియు........."

విషయపరిశోధకు డొకడు తా నదివరకు ఒకవిషయమై వినియుండి దాని ప్రత్యక్షముగ జూచినంతట పొందు అభివ్యంగముతో నే నా అమెరికాయువతిని దిగాలబడిచూచి నానాదేశరాజులనుగూర్చియు మంత్రులనుగూర్చియు రాజదూతలనుగూర్చి ప్రతిదినమును [6] డౌనింగువీధిలో సృష్టింపబడుచుండు కూటలేఖల నీ యువతి యుదహరింపనున్నదియాయని విహ్వలత జెంది ఇటులబలికితిని: "ఓసీ నా యమ్మగడే. ఎంత

1 ప్రజాసామాన్యమే తమ దేశమును పాలించుకొను రాజ్యాంగవిధానము (Democracy).

2 ఏకపురుషప్రయుక్తమగు పరిపాలన (Democracy).

3 ఆస్క్విత్తు ప్రభువుగారు మార్గో దేవి భర్తయని పాఠకులు గ్రహించియుందురు.

4 జర్మని దేశములో ఫిరంగులు మొదలగు యుద్ధసామగ్రి జేయు గొప్ప ఆయుధాగారము.

5 ఓడయుద్ధముల జేయు సేనాధిపతి.

6 లండనులో గొప్ప ఆఫీసులుండు వీధి.

విచిత్రము! మీరు ఆస్క్విత్తు పేరెత్తితిరే. ఆయన ధనవంతుడని నేను వినియుండలేదు.

అ—ఓహోహో! అటులా! నామాట నమ్మదగును. ఆయన అమితధనవంతుడు. ఆయన అభిమానమంతయు జర్మనులపక్షమే. ఇది చాల విషాదకరము. ఇంతకంతయు ఆయన యొక్కడే కాడు. ఆయనభార్యయును.[1] ఆమె మహిమవలన ఆయనయొక్క భావ్య దర్క్రశ్రేయములు నాశనము చేయబడినవి. ఆమె భయంకరురాలుగనుండును.

నేను—ఆస్క్విత్తు దంపతులలో నొకరినైన మీ రెఱుగుదురా? ఎఱుగనియెడల......

అ—(నన్ను వారించి) ఆస్క్విత్తుదేవి నందరు ఎఱుగుదురు. ఆమె అత్యంతకురూపిణి.[2]

నేను—(చిఱునగవుతో) ఇట్టిమాటలు మీదేశమున గొప్ప విజయధ్వజములుగ నెన్నబడును కాబోలును. ఇచటనన్నచో గొప్ప దౌర్భాగ్య ప్రస్తావములుగ గణింపబడును. ఆస్క్విత్తుదేవి నందరుఎఱిగియున్న నుండురుగాక ఆమెనుగూర్చి స్వంతముగ మీకు విశేషమేమియు తెలిసియుండదనుకొనెదను.

అ—స్వంతముగనా యేమియు తెలియదు. తెలియకపోవుటయు సంతోషావహమే. ఆమెచేతిని తాకుటకును నే నిష్టపడను. నేను అట్టి యాడుదానితో కూడ ఒక్కగదిలో కూర్చుండనొల్లను. అమెరికాయం దెచ్చటను నట్టి యామె నొక్కర్తుగనుకొనజాలనని నా నమ్మకము. అందరు చెప్పునదేమనగ యుద్ధపు జోలియే యామె నంటజాలదట. ఆమెఅంత కఠిన హృదయురాలట![3]

నేను—ఇంకను మాటలు పెంచుటకంటె నా కొకటి తెలుపగోరెదను. మీరు మీ మనఃపూరితముగ మాటలాడుచున్నారా? ఈ ముక్కిడి వెఱ్ఱిమాటల మీరు నమ్ముచున్నారా? మీరు అంతటి యవివేకవతులుగనుందురా?

అ—సరియే. ఇంతకాలము మీ రెచటి బ్రతికితిరమ్మా? ఆమె గడుసుమనిషియనియు పైపూతతళుకు జేయుననియు తాను జేయవలసియుండు కర్మలపని నంతయు తనకుగా మరియొక్కనిచే చేయించుకొనగల తెలివితేటలుగలదనియు లోకమంతయు నెఱిగిన విషయమే. అట్టి స్త్రీతోటి సాంగత్యము నాకు కలుగనున్న నేను గడగడ వణకిపోదును.

ఈ సందర్భమున పూర్వవయస్కుడగు సైన్యోద్యోగి యొకడు మా బండిలోనికివచ్చి తత్తరపాటున నా ఖలం దానుపెట్టెను తట్టుకొని పడపోయి లేచి క్షమాపణపూర్వకముగ వినతియొనర్చి తన సామానుల సంచిని యాటకిమీదపెట్టి తిరిగిపోయెను.

అంతట నేను అమెరికాయువతికి ఎదురుముగనై ఆశ్చర్యవిహ్వలములతో దిగాలపడి పెదవిపై వ్రేలు పెట్టుకొని కూర్చుండుఆమెతో నిటులంటిని:—

నేను—నాబండిలో మిమ్మెక్కించుకొనుటవలన మీ కేవిధముగనైన యుపకరింపగలనా. నా నౌకరు టాక్సిబండితో[4] స్టేషనుయొద్ద నాకై వేచియుండును.

1 ఈ సంభాషణలోని యామె మార్గోదేవి యని పాఠకులు గుర్తింపగలరు.

2 మార్గోదేవి మహాఅందకత్తె యని స్వీయచరిత్ర ప్రథమసంపుటమున చూడనగును.

3 ఈమాటలు మార్గోదేవిగారికి బహుకఠోరములుగను కర్ణశూలములుగను తగిలియుండును. అయినను ఆమె బహుశాంతముతోడను గొప్పమనసుతోడను వాని సహించినది. ప్రస్తావనలోనుండు సంభాషణయుండు పుటకు ముందుపుటలోననే గాయములతగిలియు, ఇతరవిధముల యశక్తులయినట్టియు యుద్ధభటులకు చేయుచుండిన యుపచారములు సేవలు చెప్పబడియున్నవి. యుద్ధవిషయమున నీమె విముఖురాలయియుండినది కాదు. చాల పూనికతో పని జేయుచుండినది.

4 బాడుగలకువచ్చు మోటార్లు.

అ—(తన పొడుగాటి[1] వ్రేళ్లయంగుళి త్రాణముల సవరించుకొనుచు కృతజ్ఞతతో నుపాంగుచు) ఏమందు నమ్మా. ఎంత నిజమైన దయజూపితిరి. మీరు సంపూర్ణ ప్రేమస్వరూపముగనున్నారు.

ఇంతలో రైలు [2]పాడింగుటను స్టేషను చేరి ప్లాటుఫారముకడ నిలిచినది. మే మిరువురు బండిలోనుండి దిగి టాక్సిబండి వచ్చువరకును ప్లాటుఫారముమీద నిలుచుకొనియుంటిమి.

అ—(తన మణికట్టు గడియారము స్టేషనుగంటకు సరియొత్తుకొనుచు) ఏమి చెప్పుదునమ్మా! నా ప్రతి వందనముల నర్పించెద. నాయొద్దికలకు సకాలమున జేరగలను. మీరు లేనియెడల నేను చాలచిక్కులబడియుండుదును.

అంతట నన్నటునుండి యేమో ఆవేశమువచ్చినటుల ఆ అమెరికాయువతి అంగుళీత్రాణవేష్టితమగు తనచేతిని నాచేతిమీద బెట్టి మనఃపూర్వకముగ నిటులనినది.

అ—మీ రొక యద్భుతవ్యక్తిగనున్నారు.

నేను—(కొంతసే పేమియు బదులుపలుకక ఆమెను జూచుచు నిలుచుకొనియుండి) కడకు నేనంత భయంకరురాలను కాదుకదా.

ఈమాటలకా అమెరికాయువతి కండ్లు మూతపడినవి. ఆమె నా దిక్కుమొగమై పెనుబాముచే నాక్రమింపబడిన పిల్లబోరువలె ప్లాటుఫారముచప్పటపై తిన్నగ నాయొద్దకునడచి, "ఈశ్వరా! అంతయుమధుమయముగనున్నారు! అయితే మీరు [3] కాదుకదా."

నేను—అవును. నేనే ఆస్క్విత్తుదేవిని. టాక్సిలో నెక్కుము.

అ—(తత్తరపాటుతో బండిలోనెక్కి బండి కావండిషుచౌకులో మా యింటికి పోవుచుండగ బండిలోకూర్చుండి) "ఏమాయెను! నే నేమంటిని! ఓదేవుడా! నేనేమంటిని."

నేను—నా భర్తగారిని మీరు స్తోత్రము జేసితిరి. ఆయన చాల తెలివితేటలు కలవాడని మీ స్నేహితు లనుకొనిరి. క్రూపుకంపెనివా రాయనను ధనికుని జేసిరి. అయితే అట్టిది మీకు సరిపడదుకదా. ఆయన యభిమానమంతయు పూర్ణముగ జర్మనులపక్షమె కదా! తన రాత్రింబగళ్లు యుద్ధమున కర్పించినటులును, తన కుమారులను యుద్ధమున[4] కాహుతి జేసినట్లును, ప్రపంచముమీద తనదేశస్థు లెచట నెచటనున్నారో, వారినందరిని తనవలెనే చేయుమని ఉపన్యాసములద్వారా ప్రోత్సాహపఱచుచుండునటులను (ప్రకటింపబడియుండు వార్తలను) బహుశః మీరు చదివియుండరు. అవిఅన్నియు వట్టిబూటకములై యుండవలెను. ఎల్లపుడు కెల్లిగ్రాము తంతికొన యొకటి తన చెవిలో బెట్టుకొని పీనుగలపై రూకలు కూడబెట్టుటయే గదా!

అ—(ఈపట్టున నామాటల కడ్డబడి చెవులుమూసికొని) అయ్యో! వలదు వలదు. నిలుపుము. దయచేసి నిలుపుము.

నేను—(నాధోరణిని నిలుపక) మీ అమెరికా ఖండమున నెచటను ఆస్క్విత్తుదేవివంటి గడుసుదనము గలదియు నిర్దయురాలును లేదంటిరి. ఆమెనుగూర్చి

1 Gloves - ముంజేతికి వ్రేళ్లకు వేసికొను కవచము.

2 ఇది లండను మహానగరమున నొక స్టేషను.

3 'మీరు కాదుకదా ఆస్క్విత్తుదేవిగారు' అను అర్థోక్తి.

4 ఆస్క్విత్తు ప్రభువు గారికి ప్రథమభార్యవలన కలిగిన ముగ్గురుకుమారులు ఇరోపామహాసంగ్రామమున యుద్ధము జేసిరి. ఒకడు రణరంగమున చనిపోయెను. ఇంకొకడు బాంబు గుల్లతాకుడుచే బీభత్స్యజెందెను. మూడవవాడు యావజ్జీవము వికలాంగుడాయెను. ఈ సంభాషణలోని మార్గోదేవిగా రాయన రెండవభార్య.

నే నేమియు రెండుగనుండువటుల నటించినందులకు నే నింతకాల మెచట కాపురము జేసితినంటిరి - ఆమెను మీరు సొంతముగ గుర్తెఱుంగక పోవుట మీకు సంతోషముగనున్నను యుద్ధపుతొలిరోజు యామె స్మరింపనె స్మరింపదని మీ స్నేహితులవలన మీరు వింటినంటిరి. అట్టియాడుమనిషి చేతని స్పృశించుటకైన మీకు మనసు రాదంటిరి - (అంతట - ఆమెమాపున దైన్యముకనుగొని) చీకాకుపడకుడు - పామరజనముగాని అచ్చువ్రాతలందుగాని నన్నుగూర్చి యెవరేమన్నను అట్టిదానికంతయు నేను సంపూర్ణముగ పెడచెవియొగ్గదను - అట్టివి సరకుగొనతగినవి కావు. అయితే నా భర్తగారి ప్రశంసవచ్చినపుడు...

అ—అయ్యో - అట్లుకాదు - మిమ్ముగూర్చి పామరలోక మనుకొనుమాటలకేమి లెండు. మీ భర్తగారియెడల అత్యంతస్నేహభావమును ఆసక్తియు గలవారనేకులుగలరు. అంతియగాక ఆయనయు ఆత్మరక్షణదక్షుడు. అందరికిని ఆయనయం దమిత విస్రంభముగలదని నా స్నేహితులు చెప్పెదరు...

నేను—(ఈ పట్టున ఆ అమెరికాయువతిమాటల కడ్డముతగిలి) జర్మను బాంబుగుల్లలో పాలిభాగరి నెవ్వరైననమ్ముదురా? మీ స్నేహితులు వింతమనుష్యులుగ నున్నారు.

అ—బాగు - బాగు అందరు నమ్మినను నమ్మకపోయినను, ఆయనను నమ్మనివారికంటె నమ్మువారెక్కువగనున్నారు. అయితే మీవంటి సాధ్వీపై నిట్టి మహాదారుణములగుమాటల వెదజల్లుట మహాఘోరముగనున్నది, ఇట్టి యపవాదములనెల్ల మీరు బహిరంగముగ ప్రకాశముగ నిరాకరింపవలసియున్నది.

నేను—దాదాపు పదేండ్లపాటు ఇంగ్లాండు ప్రధానమంత్రిగనుండినవారు ఖలులుగగాని తెలివితక్కువవారుగగాని యుండజాలరని [1] ట్రిఫాల్గరుచౌకున చాటించుకొనమనెదరా? లేక అస్క్విత్తుదేవి [2] జర్మనువారి గూఢచారిణి కాదనియు అస్క్విత్తుకన్య జర్మను నౌకాదళనాయకునికి నిశ్చయింపబడలేదనియు, డానింగుటన్ [3] హాలు యెచటనుండునదియు అస్క్విత్తుదేవి యెఱుంగ నెయెఱుంగదనియు అస్క్విత్తు ప్రభువయ్యని సంతాపానుతాపములు మనయోధులయెడలనే ప్రవర్తించుచున్నవిగాని వీరికుమారుని [4] చంపినవారియెడల కాదనియు గంటవాయించుకొనుచు కేకలుపెట్టుచు వీధులవెంట పొమ్మనుదురా?

అ—అటులెందుకు చేయవలయునుగాని మిమ్మును గూర్చి యిట్టి దారుణాపవాదముల ప్రకటింపకుండ నివారించుట కద్దియైన మార్గముండవలెను. స్వపక్షరక్షణకై మీకేయుపాయము తోచలేదా?

నేను—లేదు. క్రూరులనుండియు నిర్వ్యాపారులనుండియు తనను కాపాడుకొనుటకు నాకే కాదు మరెవ్వరికిని శక్యముకాదు - ఇంకెందుకు. పరమదయాళురుగను, వివేకవతులుగను గనపడు మీరే నన్ను గూర్చిన యిట్టి యపవాదములనెల్లనమ్మి నాకు వల్లెచెప్పగ ఇక ఇతరులనేల యనుకొనగూడదు? నన్ను బాగుగనెరిగిన మీ స్నేహితులును ఇట్టివాని మీకు జెప్పిరికదా. రెండుఘడియలకుముందు అట్టివానినెల్ల మీరును నమ్మితిరిగదా? ఇపుడుమాత్ర మేలనమ్మరు? యుద్ధమున బందీకృతులయిన జర్మనుయోధులతో టెన్నిసు [5] ఆటలాడుచు నేను దినములుగడిపినది లేదనియు వారికి చిఱుతిండ్లకు తాబేళ్లను దుంపలను

1 లండనులో ప్రధానమగు బహిరంగచౌకు. 'Trafalgar Square.'

2 మార్గోదేవియే.

3 డానింగుటన్ హాలు లండనులో జర్మను యుద్ధబందీలనుంచినశాలయని తోచుచున్నది.

4 అస్క్విత్తుప్రభువుగారి కుమారుడు "రేమండు" యుద్ధరంగమున హతుడాయెను. (676 పుట చూడుము)

5 చెంబ్లతోను నరములతో కట్టబడి జల్లెడలవలెనుండు పలకలతోను ఆడుబంతిఆట.



శ్రీమతి విమలా రామరావుగారు
ఉన్నతవిద్యకై ఇంగ్లండున ౧౯౨౯.



తల్లిపాల పెరిగిన బిడ్డ.

నమర్పలేదనియు, నా కూతురు ఎలిజబెత్తు మా ఇంగ్లీషు వారి నౌకాదళ ప్రగూఢయానములను ద్రోహముగ తన జర్మనువరునికి వెలిబుచ్చుచుండలేదనియు ఇప్పటి కైన మీరు నిజముగనమ్మితిరా? ఈ యుద్ధమును గూర్చి నాకును నాభర్తగారికిని ఎట్టి చులుకుతెలి యున్నదియో — ఆయనయే కాదు యుద్ధమునుగూర్చి నేనును ఆయనయు నెట్టితలంపుకలిగియున్నారమో — మీ కెట్లు గోచరింపగలదు. ఈనాటి స్వల్పవ్యవధిలో మీ తో కలిగిన కొలదిపాటిపరిచయముమీయందు నాటుకొని యుండు దృఢప్రతీతులచేల పారదోలగలుగవలయును?

నేను—(అంతట నా అమెరికాయువతి ముఖము చిత్తసంక్షోభమున వెలవెలబారుట కనుగొని కరుణార్ద్రినై) నన్నుగూర్చి మీ స్నేహితులు మీకు జెప్పిన మాటల మీరు కొంచె ముపేక్షించితిరి కాబోలు.

ఆ—(సోద్వేగముగ) ఏమి యట్లనెదరు! ఎంత మాత్రమును లేదు. నేను ప్రమాణముగ జెప్పుచున్నాను. ఆ [1] తరుణయోధుడు మన బండిలోనికివచ్చినపుడు మన మధురసంభాషణమంతయును నంతరించునేమో యని యాతని నామనమున తిట్టిపోసితిని. ఇపుడు వానికి మంగళాశీస్సుల నర్పించుచున్నాము. అతని రాకవలనగలిగిన యభ్యంతరము లేకుండిన నేనిపుడు మీకొప్పగించిన నపదూరులకంటె చెడ్డమాటల జెప్పి యుందును.

నేను—(ఆమె నిష్కాపట్యమునకును నైర్మల్యము నకును సంతసించి) నేను యుద్ధపుమాటల నే తలపెట్ట ననుటకంటె తోడి యాడుదానిని ఇంకెవ్వతెయైన యెట్టి దురుక్తులుగాని క్షమింపనర్హములుగాని ఇతర మాటలుగాని యనగలదా? నాశత్రువులందరు గుమి గూడి సమ్మెకేసి నన్నవమానింప బూనుదురేని ఇంత కంటెచులుకగ నాకుతగులగల ఇతరప్రసంగమును పుట్టింపజాలరు.

ఇంతలో మేమెక్కిన టాక్సి కావండిషచాకులో మాయింటికిఁజేరి నిలిచినది. ఇంటిలోనికి తనను రానిమ్మని ఆమె నన్నతిదీనముగ ప్రార్థించినది.

ఆ—నన్ను ద్వేషించెదరా? నేనతి దారుణస్వభావు రాలననితలచితిరా? అయ్యో! నన్నొకక్షణము మీ యింట నడుగుపెట్టనిండు.

నేను—మీరు పోవలసియుండు యొద్దికలకుపోవు టకు మీకు ఆలస్యము కాదా?

ఆ—దాని నూడ్చుకొనిపోనిండు. యథార్థముగ మీకు నాయందిష్టము లేదు.

నేను—(అమెరికాయువతిమోమున దైన్యవిరుత్సాహములు పొడగట్టుటకనుగొని) బాగుబాగు - లోనికి రమ్ము - నేను మీకు తేనీటినిచ్చెదను.

ఆ—(అచటి మహోఘనితలంపులను రంగుతీర్చిన పడికట్లనుచూచుచు అనన్యమనస్కయై నాపై దృష్టినిలిపి) ఏమివింత! మీరె నిజముగ అస్క్విత్తుదేవిగారా! ఈసుందరభవనము మీకాపురస్థలమా! మీరు చనవు నెఱపువారనియు దాక్షిణ్యమును వెల్లివిరియజేయు వారనియు నమ్మితిని.

నేను—తొట్రుపాటుజెందకుఁడు, మీరన్నవిసరియె. రెండును నాయందున్నవి.

నాతోఁగూడ నామె సజ్జాగృహము ప్రవేశించి యందుండు కిటికీలగుండ కంకర గొట్టిన ప్రాంగణపు చదురును రోడెండ్రా[2]ను మొక్కలయొక్క పువ్వులను మిలికెలు విరివిగయుండు ఆకులుగల తీగెలను కొంత సేపు చూచిచూచి అటుపై నా పుస్తకభాండారము ప్రక్కతిరిగి యుద్విగ్నమనస్కురాలై యచటగూర్చుం డుటకును పాలుపోక భ్రమజెందినటులుండగ నేనే యామెకు తేనీరమర్చితిని. ఇంతలో నా కార్యదర్శినియు నేస్తమునగు నేకన్య నా ప్రవాసమునవచ్చిన నాజా

1 675 పుటజూడుము.

2 ఇంగ్లాండులో శ్రేష్ఠమగు కలపసామానుల కుపయోగించు నొకజాతిచెట్టు.

బుల దెచ్చియిచ్చెను. అందొక జాబుకవరుపై "రవానా – ఆస్క్విత్తుదేవి – 10 డౌనింగువీధి – ఎవరో పేరుతెలియదు" అని వ్రాయుండినది. దీనిని జూచి ఆ అమెరికాయువతిని కొంతవినోదింపజేయు తలంపుతో ఇటులంటిని: "దీనిజూచితివా – నేను ఇంత ప్రసిద్ధురాలనుగనుండినను ప్రధానమంత్రిగారి కార్యదర్శులు నాపే రెన్నడును విననవారుకారు."

ఆక్షణముననే ఆస్క్విత్తుప్రభువుగారును దయచేసి నట్లు తలవాకిటితలుపుపైనుండు హెచ్చరికగంట వాగినది.

నేను—నాథ ర్తగారు విజయముచేసిరి. వారికి నిన్ను ఎఱుకపఱచుట మీకు సమ్మతమేనా? అయితే మీ పేరు నాకుతెలియదే? ఎవరనిచెప్పుదును?

ఆమెతనపేరు చెప్పినది: (మార్గో దేవిగ్రంథమున ఆపేరుయొక్క మొదటియక్షరములమాత్రము సూచించినది.)

నా పేరు ఐ-ఎ-

ఆ—మీ పేరును తెలుసుకొనవలయునని నేనెంతయు ఆతురపడుచున్నాను.

ఆస్క్విత్తుప్రభువున కీమెపరిచయము చేయబడినంతట ఆయన యీమెతో కొంతసేపు సల్లాపములు జరిగించెను.

తరువాత ఆస్క్విత్తుదేవి ఆమెను వీడుకొలిపి సెల విచ్చినది. అపు డా అమెరికాయువతి దేవిగారిని గాఢముగ ముద్దుకొని[1] ఇటులనినది:—

"నన్ను క్షమించినందుకు ప్రతివందనముల నర్పించుచున్నాను. మీకొఱకై ఈ ప్రపంచమున నేను నెరవేర్పక నిరాకరించున దెద్దియు లేదని మీరు నన్ను జ్ఞప్తియందుంచుకొనవలయును."

ఒంగోలు వేంకటరంగయ్య.

1 సెలవుపొందునపుడును ప్రేమ తెలియచేయునపుడును ఇంగ్లీషుస్త్రీలు ఒకరిచెక్కిళ్లనొకరు ముద్దుగొనుదురు. హిందువులలో చిన్నవారు పెద్దవారిపాదములకు నమస్కరింతురు. పెద్దవారిని మూర్ధాఘ్రాణము జేయుదురు. మహమ్మదీయులలో చిన్నవారు పెద్దవారిపాదములకు మ్రొక్కి ముద్దుబెట్టుకొందురు. అట్టిదానిని వారు "ఖదంబూసి" యందురు.

# కర్మ

శ్రీ చెన్నూరు వాసుదేవరావు గుప్తగారు బి.ఏ.

కర్మకు కర్తలమూ అన్న పాతలోకోక్తి మనలో పరిపాటయిపోయినది. ఇందుగల నిజమెంతో దీనివల్ల వెల్లుచున్న నష్టమెంతో, మనవా రూహించుటలేదు. కర్మఅనునది దేవునిచే మన నుదిటిమీద వ్రాయబడి యున్నదనియు ఆప్రకారమే మనము నడచి తీరవలెననియు, వారినమ్మకము. కర్మకల దనికాని లేదనికాని నేను ప్రస్తుతము చెప్ప జాలను: ఏలన్న నిది (కర్మ) నిజమని ఋజావు పరచుట నాతరముకాదు సరేకదా! కర్మ నిక్కముగావున్నదని సకారణములతో (Reasonable) రుజావుచేయుట యింకొకరి తరముకాదని నానమ్మకము. అట్టిసమర్థు లెవరైనయున్నచో కర్మవున్నదని పత్రికలో రుజావుపరచినచో నేనెంతయు సంతసించు వాడను. అది ప్రజోపకారమని నాదృఢ నమ్మకము. సరే, కర్మలేదనికూడ నేను చెప్పను. రుజావుచేయ ప్రయత్నించను. యిది చాలమందికి కోపకారణము.

ఈకర్మమీద ఆధారపడి మనవారు అనేక చెడుపనులకు లోనగుచున్నారు. ప్రతివానికి కర్మఅనడము నుదిటవ్రాసినవ్రాత తప్పింప నీతరమా, నాతరమా కర్మకు అందరమూ దాసులమే, కర్మను జయించలేక యీశ్వరుడు సహితము, స్మశానవాసియై పుణిక చేపట్టికొని యిడుములకులోనై యున్నాడు, అని మెట్టవేదాంతములు మనవారు పల్కుదురు.

బడికుర్రవాడు తెలివితేటలులేక, శ్రద్ధగా చదువులేక పరీక్షయందుతప్పి, నాకర్మ బాగులేదనిచెప్పి తనపైగలనింద కర్మపై పడవేయును. కర్మానివుంటే యీసంవత్సరము స్కూలుఫైనలు పేసయి కాలేజీలో చదువుదును, లేనిచోలేదు, అన్నివేదాంతములు వానిచదువులో శ్రద్ధకు కొంతఆటంక పరచును. తండ్రి తనకుమార్తెను, ముసలి వానికి అంటకట్టి దాని కర్మఅనిచెప్పి తప్పించుకొనును. దుర్బలమైనమనిషి తను దృఢకాయుడు కావలెనన్న తలంపుతో తగిన శరీరవ్యాయామము తీసుకొనక, యిది నా కర్మమని సంతృప్తిజెందుచుండును. చింతామణినాటకములుచూచి, చింతామణి తెనుగు సినీమాలుచూచి, సుబ్బిశెట్టి చెప్పిననీతులు, ("కోమిటోణ్ణి గనుక కొంతనయము") అర్థముచేసికొని, అన్నితెలిసి భోగముదాని యింటికివెళ్లి, తను సంపాదించలేకపోయినా పెద్దలుయిచ్చిన ఆస్తి తగలెట్టి, ఏమిరా యిలాగచేసితివని ఎవరైనా అడుగుతే "బుద్ధిః కర్మానుసారిణీ" అని చెప్పి అడిగిన వానికి టక్కున జబాబిచ్చి వాని నోరు మూయించును. హిందూదేశమున తదితర దేశములకంటె శిశుమరణ సంఖ్య అధికముగనున్నదన్న సంగతి తెలిసికూడ దాని కారణములు నిర్మూలింప యేమాత్రము ప్రయత్నించక యిది మన కర్మ కాబోలని తలంచి దేశమున కెంతో అపకారము చేయు

చున్నాము. ఎన్ని వేల సంవత్సరముల క్రిందటనుంచో మన హిందూదేశజులు, పరాయి దేశజులచే పాలింపబడుచున్నారు. అది మాన్పించి స్వతంత్రులగుటకు ప్రయత్నించక యిది మన పురాకృతకర్మ మని హాయిగ కూర్చొను మూర్ఖులు సహితము మనలో కొంతమంది కలరేమో అని నేను చాల భయపడుచున్నాను. యిందుమూలముననే కాబోలు మన కాంగ్రెసోద్యమము యింత మందముగనున్నది. కర్మకు కర్తలమూ అన్న నమ్మకము యింతకన్న మీ కేమి నష్టము చేకూర్పవలెను? యిది చాలదా? పాకీవాడు మనవంటి మనుజుడే కదా. వాని కెందు కంత నీచవృత్తి? అని మన సనాతనులను ప్రశ్నించినచో అది వాడి కర్మఫలమని ప్రత్యుత్తరమిచ్చి తప్పించుకొందురు.

కర్మను దృఢముగ నమ్మినవానికి నే నొక సవాలు చేయుచుంటిని. కర్మమీదనే వాని జీవితము ఆధారపడియున్నదని వాని నమ్మకము కదా? అట్లయినచో ఆయన తెగించి విషము త్రాగగలడా? మంచి అయిననూ చెడ్డఅయిననూ కర్మ ప్రకారమేకా సంభవించునది. ఆపాటి దానికి జడుపేల?

కర్మ నిజముగా మనకు వుంటే వుండనిండు. లేనిచో లేకపోనిండు. కర్మ లేదనుకున్నంతమాత్రమున నష్టములేదు. వున్నదనుకున్నందువల్ల లాభములేదు సరే కదా? నష్టములు పైనుదహరించితిని. గనుక కర్మ సంగతి మనము పూర్తిగ మరచిపోయి మన విధులను మనము నెరవేర్చుకొన్నచో చాలా లాభకరమని నామనవి. కర్మ కర్మ అని మన నెత్తి బ్రద్దలుకొట్టుకొన్నచో వచ్చు లాభములేదు సరేకదా? మన యువకులు సహితము యీ కర్మ అను నల్లమందు అభ్యాసమునకు లోనయి వారి భావి భాగ్యోదయాన్ని పాడుపరచుకొనుచున్నారు. కర్మ వుండుట నిజమనుకొందము. కాని దాని సంగతి పూర్తిగ మరచినచో మేలు కలదు. అది దేశకల్యాణమునకు తోడ్పడ గలదని నా హృదయపూర్వకమైన మనవి. దీనిని కాదనువారెవరైనను నన్ను ఒప్పించినచో వారికి ధన్యవాదము లర్పించువాడను.

# విఠలనాథుడు

## ( హంపీ శిథిలములు )

అవిచరిత్రలలో చూచినయణువు లక్ష్మి
మరువబడినవి, అవి కావ్యసరణియందు
అతిశయోక్తులు సమ్మతాదయ్యెవాని,
కల్లనిజమయ్యె నీవు సాక్షాత్కరింప.

ఆంతరంగిక భాషణాలయంబున దివ్యపగులుచూపింప దిప్పటికిగూడ
పంపాసరస్సులోపల లేతతరగలో విరుపుకన్పింప దీవేళగూడ
'చిగురుకొమ్మైనను చేవ'న్న పెద్దన్న నుడిపొల్లుగాని దిప్పుడునుగూడ
భీమసేనేక్షణాభీలరక్తిమలోన వలుపుకన్పింప దీనాడుగూడ
జడములివి చేతనత్వంపుజాడలేల, నేటికినిపీనిలోనిట్లు నిలిచిపోరు
దివ్యసామ్రాజ్యపీఠాధిదేవతయగు, మా తెలుగువీర్య మేల యచేతనంబు ?

—హంపీ క్షేత్రము.

ఆంధ్రులలో తిరుపతి నెఱుగనివారు, హంపినిగూర్చి విననివారు ఉండరు. విజయ నగర సామ్రాజ్యమునకు ప్రధానరాజనగర ముగా, హంపి వర్ధిల్లినది. హైందవనాగరకత, విజ్ఞానము, శిల్పనైపుణ్యము లోనగువానిని రెండుమూడువందల యేండ్లవిచ్ఛిన్నముగా కాపాడి వృద్ధిపఱచినది విజయనగర సామ్రాజ్యమే.

దీనికి 1565 సంవత్సరమున జరిగిన తల్లికోట యుద్ధముతో పతనము గలిగినది. ఈ యుద్ధానంతరము మూడవదినమున "విజయులగు మహమ్మదీయులు విజయనగరము (హంపీ)చేరి, అయిదు నెలలకాలము అవిచ్ఛిన్నముగా, ఆయుధములతోడను, అగ్నితోడను, గడ్డపారలతోను, గొడ్డండ్లతోను, దినము వెంట దినము నగరనాశనమునకు పూనుకొని నిర్వహించిరి. ఇట్టిది ప్రపంచచరిత్రయందపూర్వము..."* కావున దేవవైభవముతో తులతూగుచుండిన హంపి నేడుపాడు స్థితిలో నుండుటజూచి

"శిలలు ద్రవించి యేడ్చినవి
జీర్ణములైనవి తుంగభద్రలో
పల; గుడిగోపురంబులు స
భాస్థలులైనవి కొండముచ్చుగుం
పులకు; చరిత్రలో మునిగి
పోయినదాంధ్ర వసుంధరాధిపో
జ్జ్వలవిజయ ప్రతాపరథ
సంభ్రమ స్వప్నకథావిశేషమై."1

అని విషాదపడని ఆంధ్రుడుండబోడుకదా !

* Sewell-A Forgothen Empire P. 208
1 హంపీ క్షేత్రము.

శిథిలావస్థయందున్నను శిల్పచాతుర్యమున నెట్టివానికయిన మిఱుమిట్లు గొల్పునది హంపియందు విఠలాలయము. హంపిలో నింతకన్న మనోహరమగు ఆలయము మరొకటిలేదు. శ్రీకృష్ణదేవరాయలు ఈ విఠలాలయమును నిర్మించెను అని కొందఱందురుగాని కవిసార్వభౌముడు శ్రీనాథుని నాడే యీ యాలయము వెలసియుండెనని హరిభట్టుని వాక్యమువల్ల[2] తెలియుచున్నది. ఏదెట్లున్నను శ్రీకృష్ణదేవరాయలీ దేవాలయమును పెక్కువిధముల నభివృద్ధిపఱచెనను టలో విప్రతిపత్తిలేదు. ఇంతేకాదు. శ్రీకృష్ణదేవరాయల పట్టపుదేవులగు చిన్నమదేవి, తిరుమలదేవిగార్లును, రాయలతరువాత రాజ్యముచేసిన అచ్యుతరాయలు, సదాశివరాయలు, మఱి పెక్కుభక్తులు ఈదేవునకు లెక్కలేని మడిమాన్యముల సమర్పించియున్నారు. పండరినాథుడే హంపీదేవాలయమునకు రాదలంచి ఈ ఆలయ వైభవమును జూచి తన కింత యక్కఱలేదని నిశ్చయించుకొని తుదకు రాకమానెనని ఐతిహ్యమొకటిగలదు; కాని చారిత్రికముగా 1565 లో కలిగిన పతనమే ఈదేవాలయ నిర్మాణము పూర్తికాకపోవుటకు కారణమై యుండనోపును.

ఈ గుడిచుట్టు ఉన్నతప్రాకారముగలదు. గుడిలోనికిపోవుటకు మూడు వైపుల (తూర్పు, దక్షిణము, ఉత్తరము,) గోపురములున్నవి. ఇవన్నియు ప్రస్తుతము శిథిలములయి యున్నవి. అందును తూర్పుగోపురము అపాయకరస్థితిలో నుండుటచే ఆదారిని నేడు మూసివేసినారు. ఈగుడికి పైకప్పులేకపోయినను, తురకలచే అందములయిన స్తంభములు విఱుగగొట్టబడినను ఈ యాలయము దక్షిణహిందూదేశమున గల గుడులన్నిటికంటె దివ్యమైనది. "ఇందలి శిల్పమత్యుచ్ఛస్థాన మాక్రమించుచున్నది." అని ఫెర్గూసన్ వ్రాయుచున్నాడు. ఒక్కజాతిలోనే స్తంభము అందనేక మృగములు, అందు కొన్నిటిపయి రౌతులు, చాలా నైపుణ్యముతో చెక్కబడినవి. ఇట విశేషమొండు గలదు. ఒక్కొక్క స్తంభములోను పిల్లస్తంభములు ఏడుకుపైగా గలవు. వానిని ఒకకర్రతో వాయించినయెడల సప్తస్వరములును పలుకును.[3] ఇట్టివి పెక్కుస్తంభములు. దీనికి మహామండపమని పేరు. ఇది గుడియెదుట నున్నది. ఈ మండపము పైకప్పులో అతి సుందరముగా రామాయణమంతయు చెక్కియున్నది. అక్కడి సానరాళ్ల శిల్పము మిక్కిలి కొనియాడదగినవి. ఇందు హజార రామస్వామి యాలయుపక్కి చాలామట్టుకు తోడ్పడియుండును.

ప్రాకారములో గుడికి ఆగ్నేయపార్శ్వమున అద్భుతమైన కల్యాణమండపమున్నది. ఇందు అక్కడక్కడగల రంగువల్ల నూతన దేవాలయ ప్రతిష్ఠసమయమున గుడికంత

2 నరసింహపురాణము "విఠలపతికి గావించి యర్పణచేసి..."

3 "సరిగమపధనిస స్వరవల్లకీతుల్యరవ విశోభా స్తంభరాగఫణితి..." హంపీక్షేత్రము.

కును సున్నముకొట్టుట, వర్ణముపూయుట అను ఆచారములుండెనని గ్రహింపవచ్చును. బహుశః గర్భగుడికిని తత్సన్నిహిత ప్రదేశములకును మాత్రమురంగుపూయు వాడుక లేదేమో? గుడియెదుటనుండు మహామండపమువలెనే కళ్యాణమండపము ఉత్కృష్ట శిల్పచాతుర్యముతో నొప్పుచున్నది. ఈ మండపమధ్యమునను శ్రీవారి ఆస్థానార్థము వేదికయున్నది. వసంతోత్సవ కల్యాణోత్సవ సందర్భములలో శ్రీవారును అమ్మవారును ఈ కల్యాణమండపమునకు వేంచేయుదురు.

విఠలాలయ పురోభాగమున రాతిరథమొకటియున్నది. ఇది చిన్నదయ్యు మిగుల నందముగనున్నది. గుడికి పైకప్పువలె దీనికిని రథము పైభాగము స్తూపాకారముగ ఇటికలతో నుండెను. ఈ రథమంతయు ఏకశిలతోనే నిర్మింపబడినదని కొందఱ యభిప్రాయము. ఇక్కడికివచ్చు యాత్రికులు, ఈ రథచక్రమును త్రిప్పిన పుణ్యములభించునని అట్లు చేయుచుండిరి. దీనివల్ల రాతి ఇరుసు చాలామట్టుకు అరిగిపోవుటచే ప్రభుత్వమువారు చక్రమును త్రిప్పుటకు వీలుగాకుండచేసినారు. ఈరథముముందుభాగమున రెండు ఏనుగులు ద్వారపాలకులవలె కాచుచున్నవి. ఇక్కడ నింకను ఎన్నియో విశేషములుగలవు. పోయి సేవింపనేవలయు.

నేటికిని హంపి పుణ్యక్షేత్రమే. ఇక్కడికి అనుదినము వేలకొలది యాత్రికులు శ్రీ పంపావిరూపాక్షదర్శనార్థము వచ్చెదరు. ఇక్కడికి విచ్చేయువారు తత్గ్రామమునందలి యితరవిశేషములను సాధారణముగా దిలకింపరు. ఈ హంపిని ఎన్నేని విశేషములు గలవు. ఆంధ్రులు ఇట్టివానియెడ నించుక శ్రద్ధవహింతురా ?

"ఏ దేవిచిలికెనో యీపాలమీగడ
విఠలాలయ శిలావేదులందు
ఏజోదుచిందెనో యీరక్తగంధమ్ము
నరసింహదేవు పేరురముమీద
ఏశిల్పిదిద్దెనో యీకారుమబ్బుల
ద్వారపాలకరాము తేరిమీద
ఏరాజుతూగెనో యీతులాడోలలో
తులసీబంగారు మొక్కలకు మ్రొగ్గి

గీ|| ఏమహాభక్తుడిట జపియించినాడొ
దివ్యకోదండరామ పవిత్రనామ
నయనవశబరీఫలాపేక్ష నియతుడగుచు
కాలపుంబాటులందు సంకరములన్ని.

బ్రతికియు వేయిప్రాణముల
బాసియు కేయుమదేభమన్న సా
మేతకనురూపమా చరిత
మేనుమినీయది; కానిచో మహో
న్నతి నఖిలప్రపంచగణ
నంబున మాయనికన్న నేటిదు
ర్గతిగనిరూడ మాయుటకు
రాదు భవత్కథాశ్వతంబటే.4

---

4 హంపీక్షేత్రము : కొడాలి సుబ్బారావు.

# మనపతనానికి మనమే కారణము

శ్రీమతి చెరుకూరు నాగభూషణమ్మగారు

మనభారతదేశమందు సంఘ మభివృద్ధినొందుటకుబదులు నానాటికి క్షీణించుచు, అనేక దురవస్థలపాలగుచు, నతిమూర్ఖతతో నత్యంతదురాచార మూఢాచారములకు లోనగుచు, జ్ఞానాభివృద్ధులన నేమోయెఱుంగక అతి మాఢ్యముతోనున్నదనిన దీని పతనావస్థకు కారణములు స్త్రీలు, వారి యవిద్య, తదుపరి పురుషుల దౌర్జన్యములు.

స్త్రీలతివిద్యాశూన్యలై కూపస్థ మండూకముల వలె తమకు తెలిసినదానితోనే తృప్తిజెంది, యితర విషయములజోలికిబోక, వానినేమాత్రము తెలిసికొన నిచ్ఛగించక ఘోషాయను మాయకులోబడి, దానియం దత్యంతవిలువను నింపి నతిగౌరవప్రదముగా జూచుచు మోసపోవుచున్నారు. ఈ ఘోషావలనకల్గు లాభము లేవియు లేకున్నను, దీనియం దభిమానముగలవారలై స్త్రీలెల్లరు దీనినివీడిన తమ గౌరవమర్యాదలకు భంగముగలుగుననియు, నూటికికోటికి ఏఒక్క స్త్రీయైన ఏదేని వొక పనినిమిత్తముగాని, వినోదము జూచుటకుగాని, లేక సభలలో నుపన్యాసమువిను నాహ్లాదమునగాని వెళ్లినచో నామె నతితేలికగాను, అతినీచముగాను జూచుచుందురు.

అసలు సభలనియు, మహాపురుషుల వర్ధంతులనియు జరుపుట దేనికొఱకు? సభలలో సామాన్యముగా రాజకీయములు, వాటి క్లిష్టపరిస్థితులు, సంఘములు వానిలోనుండు దురాచార దురలవాట్లు, వాటిని తొలగించు విషయములు, వాటి యభివృద్ధిమార్గములు, మతములు వాటి మంచిచెడుగులగుఱించి మాట్లాడు చుండుట తఱచు వినుచుందుము; చూచుచుందుము. కానివానిని వినుచు, జూచుచునుండు పురుషులకు లేనిచెడుగులు స్త్రీలకెటనుండి లభ్యమగును? తమ యభివృద్ధినిగోరుటే తా మెఱుంగక స్త్రీలే యిట్లు వాక్రుచ్చుచుండ సంఘ మభివృద్ధి నొందుటెట్లు? తామునివసించు గృహమునువీడి వెలుపలికివెళ్లినంత మాత్రమున నెంతోతప్పనియు, ప్రమాదమనియు తలంచుస్త్రీలు సంఘాభివృద్ధిని నెట్లు కాంక్షింతురు? సంఘములోనున్న అనర్థములను, అత్యాచారములను ఎట్లు దొలగింపగల్గుదురు? స్త్రీలు తమ ఘోషాను వీడనంతవఱకు, విద్యావతులు కానంతవఱకు తమకుతామే చెడుగుల నాపాదించుకొనుటకంటే వే రేమియు చేయజాలరు; బయటకువెళ్లినంతమాత్రమున పురుషులయెదుట తిరిగినంతమాత్రమున స్త్రీలు చెడిపోదురనుమాట వట్టిబూటకము; పొరబాటు. సంసారమను శకటమునకు చక్రములు స్త్రీపురుషులై యుండ, స్త్రీచక్రము లేకుండ పురుషచక్ర మ్ముంచినంత మాత్రమున అదిశకట మనంబడునా? అదియునుగాక ఒక చక్రమునకు పట్టా ఊడిపోయి, ఆకులు విరిగి పోయినయెడల దానిని రిపేరుజేయించినప్పుడే పని కుపయోగపడును గాని, ఆ చెడ్డచక్రము నదేవిధ

ముగా మంచిన నెట్లుపయోగపడును? సంఘమును బాగుపఱచి దాని నభివృద్ధిపరుపవలెనన్న సంఘమునకు సంబంధీకులైన స్త్రీ పురుషులే గదా బాధ్యులు? ఇంకను వాస్తవమునకు సంఘమందు పురుషులకంటె స్త్రీల కెక్కుడు బాధ్యతగలదు. ఎప్పుడును స్త్రీలు విద్యారహితులై, మందబుద్ధులై యున్నయెడల సంఘమున్నతదశలో నెట్లుండగలదు? నిరంతరము గృహమందుండుటచే పరస్పరభావముల కనుగొనజాలము; పరస్పరము ప్రేమించుకొనలేము. పైగా పరస్పర విరోధము, అసూయలు అభివృద్ధినొందుట సహజము. బయటకువచ్చిన కొలదిభావము లభివృద్ధిబొంది ప్రతి విషయము విమర్శింప సమర్థతగలవారలై, ఉన్నత మార్గమున కవకాశములున్నవని చెప్పుటలో సందేహింప నవసరములేదనియే తలంచెదను.

స్త్రీలు బొత్తిగా విద్యారహితులగుటవలన సంఘము అనేక మూఢాచారములతో నిండి నిబిడీకృతమయ్యెననుటలో నాశ్చర్యమేముండును. మూఢవిశ్వాసములు, మూఢభక్తి, మూఢాచారములు మన స్త్రీలయందే యెక్కువపట్టుదలతో నాచరింపబడుచున్నవి. వీటినిగుఱించి అనేక వ్యయప్రయాసలు, పురుషుల హింసించుట, ఆర్థికముగా బాధల ననుభవించుటలు సంభవించుచున్నవి. ఇంతకంటె వేఱే లాభములేవియు గన్పట్టుటలేదు. నోము లనుపేరిట స్త్రీ లెంత ధనవ్యయము చేయుచున్నారో, వాని నాచరించిన తమ రెంత లాభమును బొందుచున్నారో, ఆచరింపనిచో వచ్చు నష్టకష్టములేవో వారా విమర్శకు గడంగరు సరేకదా. పురుషు లెవరైన నెప్పుడైన ఈనోము లెందుల కనవసరముగా పనిలేని పనులు గాకపోతే అని కొంచెము విమర్శించినట్లైన “ఆడువారలకు నోములని యెందుల కేర్పఱచిరి? అవి నోచుకోకపోతే ఫలితమెట్లా? అయినా నోము లసలెందుకు పుట్టినవి? వాని నాచరించకపోతే తప్పుగాదూ” అని స్త్రీలు బదులు చెప్పుచుందురు. పురుషు లొక్కనోమైన నొకసారియైన నోచుకోరుగదా. వారికి లేని పాతకములు వీరికే యాపాదించునా? అవి యాచరించిన స్త్రీ లెక్కుడుగా సుఖించుచుండిరా? ఆచరించని కారణముచే పురుషులే కష్టము లనుభవించుచుండిరా? వీ రనుభవించుటలేదా? ఇట్లే సంతానవాంఛచే చెట్టుకూ, పుట్టకూ, గొడ్డుకు, గోదకూ, పక్షికి, పాముకు మ్రొక్కుచుందురు. గృహములో నెవరికైన రోగము వచ్చిన వైద్యచికిత్స చేయించక వెంకటేశ్వర్లు, పానకాలరాయుడు వగైరా దేవుళ్లకు నిలువుదోపు లిచ్చెదమనియు, ఉత్సవములు జరుపుదుమనియు మ్రొక్కుచుందురు. మ్రొక్కులు మ్రొక్కినంతమాత్రమున వారికా రోగనివారణయగుచున్నదా? కొందరు మరణించుట చూచుటలేదా? అప్పుడైన వారికా మూఢవిశ్వాసములం దపనమ్మక జనింపదేమి? రోగనివారణలకు, సంధానము బడయుటకు ఏకులు ఎల్లింకులకు డబ్బు తగులబేయుదురేగాని అవి యెంతవరకు పని చేయుచున్నవి? ఎంతవరకు వాటి ఫలము మన మనుభవించుచుంటిమను విచారణే వారికి తట్టదే! ధాన్యములకు ధరలుతగ్గి ఆర్థికబాధలచే ననేక యిక్కట్లుపడుచున్నను పిల్ల రజస్వలైనదన్న అప్పుతెచ్చియైన బంతులు సాగింతురుగాని, బంతి పెట్టనిపక్షమున లోటేమియు లేదనిగాని, అసలు యీ తంతులు జరుపుట వృథాయనిగాని తలంచరు సరిగదా పైగా నితరు లాక్షేపింతురని వెఱచి ఋణబాధల నెన్నిటినైన సహించి యీ మూఢకార్యక్రమములే కొనసాగింతురు. ఇట్లు తాము కష్టములపాలగుచు పురుషులను మిక్కిలి కష్టనష్టములపాల్చేయుచుందురే సంతసముగా దోచునుగాని, యేది యెట్లుచేసిన లాభమనిగాని, నష్టమనిగాని తెలిసికొనజాలరు; తెలిసినవారెవరైన చెప్పినను అంగీకరించక తమ మూఢ్యమే తమ కానందముగా తలంచుచున్నారు.

బాల్యవివాహములనిన స్త్రీల కత్యంతవినోదముగా నుండును. ఆ వినోదములకు, ఆ పెండ్లి పేరంటములకు,

పరస్పర వియ్యాలవారికి యీ విందులకు, ఆ భాగ్య భోగ్యములకు మురిసిపోవుచుందురే గాని యీ బాల్య వివాహములవల్ల గల్గు అనర్థకములు గాని, వీనివల్లనే ప్రయోజనములు లేవని గాని, కష్టనిష్ఠురములు గాని, వాటి లాభాలాభముల ననుభవించు స్త్రీలమైన మనకు అణుమాత్రమైన నా విషయవిమర్శ తట్టనే తట్టదు. జ్ఞానలేశమైన లేని యీ పసిగందులకు, పాపము, వివాహమన నేమో, దానియం దారోపింపబడిన బాధ్యతలెట్టివో వారి కణుమాత్రమైనను తెలియదు. అట్టిస్థితిలో వారి కిష్టమైన వారినే పరస్పరము ప్రేమించి వివాహమాడుట ఆస లెరుంగనే యెరుంగరు. పెద్దవారైనకొలది, జ్ఞానాభివృద్ధినందినకొలది ఒకరికొకరు సరిపడనివారు కావచ్చును. అపు డా దాంపత్య మెంతెంత ప్రేమలతో కూడియుండునో ఆసుఖ మనుభవించువారికే తెలియవలెను. వివాహము చేయునపుడు పుష్కలముగ ధనమున్నచో వరు డెటువంటి విద్యారహితుడైనను, ఎంత వివేకహీనుడైనను, ఎంత అందవిహీనుడైనను పెద్దవార లంటగట్టుట తఱచు జరుగుచునే యుండును. పాప మా బాలిక ఆ వరు డెంత తన కిష్టుడుగాకపోయినను చచ్చినట్లు వానితో కాపురము చేయవలసినదేగదా? పరస్పరానురాగములేని దాంపత్యము లోకానికి దాంపత్యమే గాని, యథార్థమైన దాంపత్యమనంబడదు. తదుపరి నేదేని నొక విపత్తువల్ల నావరుడు మరణించినట్లైన పాప మా వధువుకు పునర్వివాహప్రాప్తిలేక తన యావజ్జీవితమును దుఃఖప్రదముగా సహజమైన ప్రకృతి సుఖములకు దూరమై, యేడ్చుచు గడుపవలసివచ్చుచున్నది. అదియునుంగాక తనయీడువారందరు సుఖముగా తమభర్తలతో కాపురములు జేయుచుండ తాను ఉస్సురుమనుచు కంటికికడివెడు కన్నీరుగార్చుకొనుచు యీ సంఘనియమములకు కట్టుబడి, తన జీవితనిస్సారముకు ఎల్లప్పుడు వగచుచు నుండవలసి వచ్చుచున్నది. అబ్బ! యెంతటి యన్యాయము!!

కొందరు బాల్యవివాహములైనవారు 11, 12, 13 సంవత్సరములకే రజస్వలలగుటయు, వారికి ఖర్చులో ఖర్చని నిషేకములు జేయుచుండుటయు జరుగుచున్నది. ఎంతఘోరము! ఎంతటిప్రమాదము!! భర్తలననేమో, వారితో కాపురము జేయుటయననేమో, యెరుంగక యుక్తాయుక్తజ్ఞానలేశమైనను లేని యీ బాలికలు గర్భిణులగుట సంతానముంబడయుటా? అవయవ పరిపక్వములేని యీ పసికందులు ప్రసవముకాలేక మరణించువారెంతమంది? అథవా ప్రసవమైరిపో, నోరెరుగని యీ బాలికలు పిల్లలకుతల్లులై శిశు పోషణచేయు చేతకాక, ఆ దుర్బలసంతానము నెప్పుడు ఈపురీవురుమనుచు కురుపులు విరేచనములతో ఈయని యేడిపించుచు బాధలు పెట్టుచున్న సహించలేక యమయాతనలపాలగుచున్నారు. పైగా చిన్నతనములో సంతానమును గని జీవచ్ఛవములై, నడుమ సత్తువలేక కురూపిణులై మరల సంతానము బడయుట. ఇక ఆతల్లులకు పుట్టినపిల్లలెంత ఆరోగ్యముగానుందురో? ఆతల్లులు బహుకాలముగాకున్నను కొంతకాలమైనను జీవింపగలరా? జీవించినను వారివి సుఖమైన కాపురములు కాబోవునా? ఇన్ని కష్టములకులోనుగావలసిన స్త్రీలమైన మనమే యీ బాల్యవివాహములను పాతకములను కూకటివేళ్లతో సహా పెకలించివేయజాలకపోగా వానినే చేయ తల పెట్టుచుందుము. మనసుఖమే మన మెరుగనప్పుడు, మనకష్టములే మనము పరికించుకోలేనప్పుడు సంఘము నెంతవఱకు బాగుచేయగలము? చాలవఱకు సంఘాచారములు బాగుపడవలెనన్న స్త్రీలవల్లనే బాగుపడగలవు. ఎందుచేతనన వివాహములు స్త్రీల అభీష్టము మీదనే యెక్కువగా జరుగుచుండును. అందుచేత బాల్యవివాహములు స్త్రీలు నిరోధించునట్లైతే చాలవఱకవి నిర్మూలములు కాగలవు.

విద్యాలోపముచేతగదా ఎంతటి తెలివితక్కువవారైనను, ఎంతమూర్ఖులైనను, ఎంతయవివేకులైనను,

పురుషుల దౌర్జన్యములకు కట్టుబడి, మంచిదైనను చెడుదైనను వారు చెప్పినదే చేయుచు, వారు వద్దన్నది మానివేయుచు, వారి చెప్పుచేతలకు లోనై, నిష్కారణముగా వారెన్ని బాధలపెట్టినను సహించి, తానును ఒక వ్యక్తినని తలంచక వారికి దాస్యము చేయుటే యత్యంతపవిత్రమని యెంచి యతిమూఢభక్తితో స్త్రీ లట్టివారిని పూజించుట? ఆ స్త్రీ విద్యాధురీణయే యైనచో నేనునొక వ్యక్తినని గుర్తించి, ఆ యవివేకములైన, కానికార్యముల జేయ నుద్యమించక మంచివని తాను నమ్మినవాటి నే నిర్వహించుచు, తన వ్యక్తితవల్ల నా మూఢదౌర్జన్యములకు లోనుగాక, భర్త ననేకవిధముల సంస్కరింప యత్నించును; సంస్కరించునుగూడ. వివేకరహితములైన భర్తల యాజ్ఞల మీఱినంతమాత్రమున యా స్త్రీ పనికిమాలినదగునా? ఇట్లు వ్రాయుచుంటినని అత్యంతపతిభక్తి గల నారీమణులకును, భార్యల వెక్కడకు గడి గడల నీయక తాము చెప్పినట్లు చేయుటకు వారినతి దౌర్జన్యము చేయుచు, వారిచే దాస్యము చేయించుకొమరగిన పురుషవరులకును కోపమురావచ్చును. విజ్ఞులును, వివేకవంతులును నైన భర్తలయాజ్ఞలు భార్యల కవశ్యాచరణీయంబులే. కాని, అజ్ఞానులును, అవివేకులును నైనవారియాజ్ఞల భావించుటెట్లో తోచకున్నది. ఈ ప్రశ్నకు సమాధానము విజ్ఞులైన తమ భార్యల చెప్పుచేతలకు భర్తలు లోనుగావలసినదని చెప్పక తప్పదు. స్త్రీలపైన మనకు విద్యలేని లోటుచే సంఘమత్యంతహీనస్థితికి లోనుగావలసినదని కొంచె మాలోచించి విద్యాభిలాషిణులై విద్య నభ్యసించి (మీ కవకాశము లేకున్న) మీ బిడ్డలను తప్పక విద్యావతులగా జేయుదురనియు, సంఘముగాని కల్మషములను పాఱద్రోలి సంస్కరింప యత్నింతురనియు, నే నిది వ్రాసితిని. కాని, కేవలము స్త్రీల కగ్రస్థానము కావలయుననిగాని, పేరుప్రఖ్యాతులకుగాని, వాగాడంబరమునకుగాని వ్రాసితినని పాఠకు లెవ్వరును తలంచరని విశ్వసించుచున్నాను.

## ప్రబోధము

మేలుకొనుమో భారతీయుడ
మేలుకొని మీ మాతృదేశము
మేలుగాంచెడి విధముఁదెలియుము
మేలుకొమ్మోయీ.

తోడిదేశము లందువలె నెం
తో స్వతంత్రత సేకరింపఁగ
పారతంత్ర్యముఁ బాఱఁద్రోలెడి
పథముగనుమోయీ.

మాతృదేశపు పారతంత్ర్యము
మాపి మనదేశమ్మువలె దా
స్యమ్ముఁబొందిన దేశములకును
సాయపడుమోయీ.

భారతీయుల శౌర్యసాహస
వైభవమ్ములుఁ ద్యాగశక్తిఁ ప్ర
బుద్ధమొనరించుటకు వేగమె
పూనుకొనుమోయీ.

భరతజాతియె పృథ్విలోగల
ప్రబలజాతుల కన్నిటికి సం
దేశమీఁగల దంచుఁబరులకుఁ
దెలుపవలెనోయీ.

బులుసు అన్నపూర్ణ.

# నా యిల్లాలు

శ్రీ అలంపురం రాజుగారు, బి.ఏ.

నా యిల్లాలు పేరు జానకి. పచ్చగా పొడుగ్గా ఉంటుంది. అందమయినవాళ్లలోనే లెఖ. అందరితోపాటు సౌందర్యపోషణ అంటే శ్రద్ధే. సబ్బు బిళ్లతో ముఖమూ చేతులూ తోముకుంటుంది గాని మా ఓవర్సీరుగారి భార్యలా వారానికో సబ్బుబిళ్లా పక్షానికో స్నోబాటిలూ కావాలనదు. తెల్లని చీరలూ, దళసరిజాకెట్లూ యిష్టంగాని లోపలిబాడీ పైకగపడేట్టు ఉల్లిపొరగుడ్డలు కట్టడం గిట్టదు. ఈమధ్య గజ్జలవడ్డాణం కావాలంది. 'ఓవర్సీరుగారు అప్పుచేసి భార్యాపోరుపడలేక వడ్డాణం చేయించాడు. నన్నుకూడా ఆపని చేయమంటావా' అన్నాను. ఆమె మళ్లా మాట్లాడలేదు. మా కూతురు 'స్వతంత్ర' పుట్టకముందు కృత్రిమసాధనాలతో సంతాననిరోధం చేయాలని ప్రయత్నించాను. అలా చెయ్యడంవల్ల ఆలుమగలు మరికొన్నాళ్లు సుఖం అనుభవించవచ్చుననీ, ఆడుదాని అందం చెడదనీ బోధించాను. కాని నామాట పడనివ్వలేదు. స్త్రీలకు చిన్నవయస్సులోనే బిడ్డలు కలుగాలనీ, అలాఉండడం అందమనీ, కావలసిన పిల్లలు పుట్టినతర్వాత సంతాననిరోధం చేయాలనీ మా జానకి వాదం.

ఆడువారి ఆరోగ్యానికి గృహకృత్యాలు స్వయంగా చేసుకోవడం అవసరమని ఆమె అంటుంది. నిండుగర్భిణిగా ఉండీ తను పనిచేస్తుంది. అందుచేతనే ఆమెకు సుఖప్రసవము లభ్యమట. ఇంటిలో ఎంత వండినదీ నన్ను ఎప్పుడూ చూడనివ్వదు. చూస్తే నేను తక్కువతినడం, వెనక వారికి మరికొంత మిగల్చడం కలుగుతుందట. మగవారితోపాటు యింటి ఆడువాండ్రుకూడా తింటే సంసారం ఆగదని ఆమె సిద్ధాంతం. మత్స్యమాంసములు తినదు. కాని కోడిగ్రుడ్లు తింటుంది. వీట్లలో స్థూలదృష్టికి కనపడే ప్రాణంలేని కారణంచేత తినవచ్చునని సమాధానపర్చుకుంటుంది.

'కొర్రగింజంత కోడలంటే అత్తకు కొండంత జ్వరం' అనే సామెత మాయింట వర్తించదు. మా అమ్మగారు కూతుర్ని కోడల్ని ఒకేవిధంగా చూస్తుంది. ఒకవేళ ఏదయినా తొందరపడి జానకి మాటలాడినా నేను కన్ను తెర్రజేస్తాను. తక్షణం అత్తగార్కి నమస్కరించి తప్పు క్షమించమంటుంది. అంతటితో రాజీ పూర్తిఅవుతుంది.

నా యిల్లాలికి సంగీతం అంటే యిష్టం. వీణగాని, ఫిడేలుగాని పాడడంరాదు. హార్మోనియం అంటే గిట్టదు. హార్మోనియం హైందవసంగీతానికి సరిపడదనిన్నీ, సెలయేటిప్రవాహంలో కొట్టుకుపోయే పుడకలా, హార్మోనియంమీద పాటకు వ్యక్తిత్వ ముండదనిన్నీ ఆమె అభిప్రాయం. సినీమాలలో పాటలు విన్నా సంతోషమే. కాని మహాపతివ్రతల పాత్రలు కేవలము వ్యభిచారవృత్తిలోఉన్న స్త్రీలచేత ప్రదర్శింపబడుచున్నాయనీ, సినీమాలలోని కొన్ని ఘట్టాల వల్ల నిష్కళంకమగు కొందరి పతివ్రతల హృదయాలు చలిస్తున్నాయనీ చాలమంది యువకులు కన్యలు పతనము చెందుచున్నారనీ విషాదం.

జానకి సతీతులసివంటి మహాసాధ్వి కాదు. సతీతులసిలా ఉండడానికి యిష్టపడదుకూడాను. కాని మా ప్లీడరుగారి భార్యలా బజారులో భార్య చెప్పులు కొనుక్కొవడం, ఆమె చెప్పులు తనభర్త మోసుకురావడం సహించదు. భర్త చెప్పిందల్లా తూచా తప్పకుండా నమ్మవలెనని గాని, నడువవలెనని గాని ఒప్పుకోదు. భేదాభిప్రాయం ఉన్నప్పుడు యిద్దరూ వాదించవచ్చును. ఒకరినొకరు సరిచేసుకో వచ్చును. ఆలుమగ లిరువురు అసిస్టెంటుమాస్టరు, హెడ్

మాస్టరు ఉన్న సంబంధంలో ఉండాలిగాని, ఇంట్లో ఈ హెడ్మాస్టరు ఉన్నట్టు ఉండకూడదు. ఆడది స్వతంత్రించి ఉద్యోగం చెయ్యడం అంటే జానక్కి యిష్టం ఉండదు. మా గుమాస్తా పెళ్లాం మరో ఊళ్లో మాస్టరీ చేస్తుందని విన్న రెండురోజులు జానకి నవ్వు ఆపుకోలేకపోయింది. పూర్వం సీత, దమయంతి, భర్తలను విడిచి ఒక్క నిమిషంఅయినా ఉండలేకపోవడం, యిప్పుడు కేవలం డబ్బుకోసం భార్యాభర్తలు వేర్వేరుచోట్ల ఉద్యోగులుగా ఉండటం కాల వైపరీత్య మంటుంది. కాని ప్లీడరుభార్య గుమాస్తాగా పనిచెయ్యడం, డాక్టరుభార్య కాంపౌండరుగా ఉండటం ఆక్షేపించదు.

వార్తాపత్రికలు బల్లమీదఉంటే ఆమె బొమ్మలు చూచి మూసేస్తుంది. బొమ్మలంటే జానకి చెవి కోసు కుంటుంది. కాని తన పడకగదిలోకూడా యూరపు దేశకన్యల దిగంబరచిత్రా లుండనివ్వదు. అవి ఆల్బం లో ఉండవలసిందే కాని బయట ఉండతగవట. నిన్న మా పొరుగింటిదంపతులు ఫోటో తీయించు కున్నారు. భార్య కుర్చీమీద కూర్చుంది. భర్త నిల పడి ఉన్నాడు. అది భారతదేశమందలి పతివ్రత లక్షణం కాదనీ, పాశ్చాత్యలక్షణమనీ విరసించింది. అప్పుడప్పుడూ 'గృహలక్ష్మి' పత్రిక చదువుకుంది. కాని కుప్పతిప్పలుగా ప్రకటనయ్యే 'నవ్వుపత్రిక'లను చూస్తే మండిపడుతుంది. వాటిని నవ్వుపత్రిక లనుటకు మారుగా 'రంగుపత్రిక'లనుట సరసమనిన్నీ వాటిని బహిష్కరింపకుండుట సంఘమందలి పేరు పురుగులను నశింపజేయకుండుటనిన్నీ అంటుంది.

జారత్వం అంటే జానకికి ఎంతమాత్రం గిట్టదు. ఈ విషయంలో ఆమె ఉద్దేశ్యం చమత్కారంగా ఉంది. ఈరోజుల్లో మగవాడు తనభార్య అధ్యాత్మ రామాయణకీర్తనలు పాడాలంటాడు. పొరుగింటివాడి భార్య ఎంకిపాటలు పాడితే వినాలంటాడు. అలాటివాళ్లకు యిలా సమాధానం చెప్పాలట. 'మీరు భార్యనగు నన్ను విడిచి పరభార్యను పొందుతున్నారు. నాకు మీవల్ల సుఖంలేదు. కాబట్టి నేను ఎవరితో చూచు కుంటాను' అని ఖచ్చితంగా చెపితే నూటికి 90 కేసులు కుదురుతాయట.

వితంతువులకు ద్వితీయవివాహం చేయడం ఒప్పు కుంటుంది కాని పిల్లలున్న వితంతువులు పునర్వివాహం కోరడం ఏవగించుకుంటుంది. జానకి బయలుజేరిన రోజుల్లో మా హెడ్మాస్టరు భార్యలాగ తల దువ్వుకోక చీరవిడువక చెంబొక టుచ్చుకుని చెరువు గట్టుమీద పెత్తనాలూ చెయ్యదు; కాలేజీలో చదువు కుంటున్న మా ప్లీడరుగారి కూతుర్లాగ బయటజేరిన రోజు లేవో యితరులకు తెలియకుండా ఉండేట్లూ ప్రవర్తించదు. శుక్రవారపు నోము ఆమెకు మిక్కిలి యిష్టం. వ్రతసందర్భాల్లో ధనికులగు బ్రాహ్మలకు విలువగు దానాలుచేయక ఆదబ్బుతో వర్ణవివక్షత లేకుండా పేదలకు అన్నముపెట్టడం పుణ్యతర మంటుంది. ఈ కాలపు క్రైస్తవుల ఆరాధనమందిరాలు చాలాభాగం పెండ్లిపేరాల చావుళ్లుగా మారిపో తున్నాయని విషాదపడుతుంది.

మాకు స్వతంత్ర అనే కూతురుందని పైన వ్రాశాను. కట్నంఅడిగే అల్లునికి యీపిల్లను జానకి యివ్వదట. కట్నం అడుగకుండా పిల్లయే కావాలన్న వానికి ప్రేమపూర్తిగా పిల్లపై ఉన్నట్టు నిర్ధారణట. అప్పుడు నే నిలాఅన్నాను. 'అన్నిలక్షణాలు ఉన్న పిల్లవాడు మన స్వతంత్రను కట్నంమీద ఆశలేకుండా కావా లంటాడు. కాని వాని తల్లిదండ్రులు కట్నం యిస్తేనేకాని పెళ్లి జరుగనివ్వమంటారు. అప్పు డేం జేస్తావు?' అలాంటి సందర్భంలో యివ్వవచ్చునని జానకి తన అభిప్రాయం సంస్కరించుకొంది.

హెడ్మాస్టరింటికీ, ప్లీడరుగారింటికీ మధ్యలో ఉంది మాయిల్లు. మాయింట్లో హెడ్మాస్టరింట్లో ఉన్నన్ని ప్రాచీనపద్ధతులూ లేవు. ప్లీడరుగారింట్లో ఉన్నన్ని పాశ్చాత్యపద్ధతులూ లేవు.

# కాశ్మీరము

శ్రీ జి. వి. చలపతి నాయుడుగారు

(సెప్టెంబరు తరువాయి)

ఇచ్చటినుండి దారి వంకరలుగా మట్టి కొండల మధ్యలో తిరుగుళ్లు గలిగి పోవు చుండును. వర్షాకాలమున అప్పుడప్పుడు కొండలుజారి దారికడ్డముగాపడి వంతెనలను నిర్మూలము జేయుచుండునట. ఇప్పుడు బందోబస్తుచేసి ఘట్టివంతెనలను కట్టించి దారి సురక్షితముగా చేసియున్నారు. యీ అపాయప్రదేశమును దాటినతరువాత విశాలమగు పచ్చని బైలులో ప్రవేశింతుము. 18 మైళ్లురాగా

### యురి

4400 అడుగుల యెత్తునగలదు. డాక్ బంగళా, ప్రభుత్వపు విశ్రాంతి గృహమును గలవు. గ్రామపరిసరమున విశాల భూభాగముగలదు. దారి అమిత దూకుడుగా నుండుటచే సుళువుజేయుటకై కఠినపుబండలను పగులగొట్టి కొన్ని వంకరలుగా త్రిప్పి సుఖకరమగు దారియేర్పరుపబడి యున్నది. జీలంనదియొడ్డున "మహూరా యెలెక్ట్రికల్ పవర్ హౌవుసు" కనపడును. జీలం నది పైభాగమున ఆరుమైళ్లనుండి యెడతెగని గొప్పనీటి ప్రవాహమున కడ్డముగ 400 అడుగుల యెత్తులో రిజర్వాయరు కట్టబడి అచ్చటనుండి దుముకు నీటిధారతో యెలెక్ట్రిక్ యంత్రము నడుపబడుచున్నది. ఇంజినీరుంగు కళానైపుణ్యము విచిత్రముగ నున్నది. ప్రవాహపు దక్షిణపు అంచుననే కొంతవరకు నీడగల పచ్చని కొండలలో రస్తా బయలుదేరి 13 మైళ్లలో

### రాంపూరు

ప్రవేశింతుము. 4900 అడుగులు యెత్తులోనున్నది. చిన్న డాక్ బంగళాగలదు. విరివిగాగల వరిమళ్ల శృంగారదృష్టిని ఆకర్షించును. పోనుపోను దారి నది మట్టమునకు సమముగా వచ్చును. చిన్నకొండల మధ్య తిరుగుడుగా పోవునపుడు 16 మైళ్లలో కాశ్మీరదేశపు పట్టణములలో నొకటైన

### బారామూలా

వచ్చును. 5100 అడుగులు యెత్తు గలదు. ఇచ్చట యీదేశపు యెగుమతి వ్యాపారము అపారముగా నుండును. ఈ పట్టణము నదికి యిరుప్రక్కల నుండును. దాటుటకు కొయ్యవంతెన కట్టబడియున్నది. మంచి డాక్ బంగళా గలదు. కొందరు ప్రయాణీకులు ఇచ్చటనుండి గృహనౌకలలో సోపూర్, వులర్ సరస్సులగుండా శ్రీనగర్ చేరుదురు. రస్తాపొడుగునను యిరు ప్రక్కల తెల్లని అడవిబూరుగ వృక్షములు పొడవుగా 50–60 అడుగుల యెత్తువరకు పెంచబడినవి. శాఖలుశిఖరములందు మాత్రమే గలవు ఆకాశము దర్శనీయమై ఆనందము గొల్పుచు ప్రపంచములో యింత సుందరమగు మార్గము మరొండు లేదనిపించు

చుండును. రోడ్డు పదినివదలి యీమార్గముగా యినుకరాతి చిన్నకొండలలో 17 మైళ్లువచ్చి

పటన్

చేరును. 5200 అడుగులు మెత్తుగలదు. ఈ చిన్నపట్టణమున పెద్దనల్లరాతితో కట్టబడిన హిందూదేవాలయములు భూమిలోనుండి త్రవ్వబడినవిగలవు. దేవదారు వృక్షములక్రింద విశాలమగు బయళ్లుగలవు. అడవి బూరుగ వృక్షములచే శృంగారవంతమై యెటుజూచినను ఆనందమగు వరిమళ్లు నేత్రోత్సవమొసర్చు చిన్నచిన్న పల్లెలును కాలువలనుదాటి రస్తామీద 18 మైళ్లురాగా కాశ్మీరదేశ వేసవి రాజధానియగు శ్రీనగర్ చేరుదురు.

జమ్ముటావినుండి శ్రీనగరు మార్గము 206 మైళ్లు. జమ్ముటావి సముద్రమట్టమునుండి 100 అడుగులు మెత్తునగలదు. (యన్.డబ్లు. ఆర్.) రైల్వేస్టేషన్ గలదు. ధర్మశాలలు భోజనశాలలు, కాఫీహోటళ్లు, డాక్ బంగళాయుగలవు. ఇదికాశ్మీరమహారాజుగారి చలికాలపు రాజధానినగరము. ఇందు రాజభవనములు, కచ్చేరీలు, గలవు. రఘునాథ దేవాలయముగలదు. దేవాలయముచుట్టు మంటపములలో కోట్లకొలది సాలగ్రామములు మండలాకారముగా వర్తులముగాదీర్చి గచ్చులో పొదగబడియున్నవి. ఇచ్చట ప్రతిదినము అభిషేక అర్చనలు జరుగుచుండును. దేవాలయముయెదుట పూర్వపు కాశ్మీరరాజుల సమాధులు కొన్నిగలవు. వాటిపై స్ఫటికలింగములు ప్రతిష్ఠించియున్నారు. అందమైన బజారులుగలిగి గ్రామమొక కోటవలె ద్వారములతో విరాజిల్లుచున్నది. యిచ్చటనుండి 21 మైళ్ల దూరములో బెట్టకొండల దారినిపోగా

ఝజ్జర్

గ్రామమువచ్చును. 3000 అడుగుల మెత్తునగలదు. సామాన్యపల్లెటూరు, చిన్న బజారు, యిచ్చటనుండి కొండదిగుడు ప్రారంభమై మెలికలుగా కొండలో తిరుగుచు 21 మైళ్లు పోగా,

ఉద్దామపూరు

గలదు. 2000 అడుగులమెత్తు. సామాన్యగ్రామము ప్రయాణీకులు అలసట దీర్చుకొనుటకు వసతిగలదు. యిచ్చటనుండి కొండయెక్కుడు తిరుగుళ్లుగా ప్రారంభమై 13 మైళ్లలో

ధర్మతల్

వచ్చును. 3700 అడుగులుమెత్తు. విశ్రాంతిగృహముగలదు. చల్లనినీరు విరివిగా దొరకును. చిన్నఅంగళ్లుగలవు. దీనికి 25 మైళ్లలో

బటోటు

గలదు. 3800 అడుగుల మెత్తు. విశ్రాంతి గృహముగలదు. తినుబండపు వస్తువులు దొరకును. దారిపొడవునను కొండలమీదనుండి ధారలుగా కారుచుండు స్వచ్ఛజలము, అలంకారవంతములగు పచ్చని

## తిరుచూరు పూరము



శ్రీ కృష్ణమూర్తి పూర్తిబలగముతోడి యూరేగింపు. "ఇసుక చల్లిన నేలపైరాలని"
జనసమూహమిందు గానవగును.

వృక్షములు, సెలయేర్లు, ఆనందము గొల్పు చుండ అచ్చటచ్చట కొయ్యవంతెనలమీద నదినిదాటుచు కొండదిగుడులో 17 మైళ్లు పోగా

రంబన్

వచ్చును. 2400 అడుగులు యెత్తు. విశ్రాంతి గృహముగలదు. చిన్న బజారుగల సామాన్యగ్రామము. ఇచ్చటనుండి కొండ యెక్కుడు తిరుగుళ్లుగల దారితో మనోహర ములగు వనదృశ్యముల వీక్షించుచుపోగా 16 మైళ్లలో

రామ్సు

గలదు. 4100 అడుగుల యెత్తు. ఈ గ్రామమున అర్ధచంద్రాకారముగా మేడలుమేడలుగా నీలగిరిలోవలె యిండ్లు గలవు. దీనికియెదుట ధనురాకారముగా నది 30 అడుగులలోతులో ప్రవహించుచుండును. నదికి ఆవలదరిని కొండమీద వృక్షములు, లతలు గుబుర్లు, దట్టముగా అల్లివలె యెంత జూచినను తనివిదీరక మహదానందమున నోలలాడించుచుండును. భోజనశాలలు, ఫలహారశాలలు, విశ్రాంతిగృహము గలవు ఈ మార్గమున కాశ్మీరసౌభాగ్యమునకు మొదటిమెట్టగు దర్శనీయముల దిలకించుచు 11 మైళ్లుపోగా

బనిహాల్

అను గ్రామముగలదు. 5700 అడుగుల యెత్తునుండి పర్వతములపైకి ప్రదక్షిణములవలె వంకరలుగా తిరుగుచు అద్భుత సృష్టి చిత్రముల జూచుచు 8000 అడుగుల యెత్తునకుపోగా అచ్చటనొక సొరంగములో దూరి దాటవలెను. ఈ మార్గమున కిరు ప్రక్కల విశాలముగానున్న కొండలమీద దట్టమైన మంచుచేకప్పబడి తెల్లనివస్త్రములు పరచినట్లుండును. ఎండవేడిమికి కొద్దిగా కరుగుచు హిమాంబువులు జారుచుండును. చలి మిక్కుటముగుటచే ప్రయాణీకులు వస్త్రములు నవరించు టత్యంతవసరము. ఈ బనిహాల్ సొరంగమువద్ద నిలబడి నాలుగు వైపులు జూచినప్పుడు కనుపడు దృశ్యము తాను స్వర్గములోనుండి భూలోకమును జూచుచుండునట్లు దోచును. ఇచ్చటనుండి కొంత కొండదిగుడు దారిన 30 మైళ్లురాగా

మందా

గ్రామము 7000 అడుగులయెత్తులో నుండును. విశ్రాంతి గృహముగలదు. చాల మనోజ్ఞముగను, హితవుగను, చల్లని సుందర వనములు జూడనగును. ఆహారపదార్థములు దొరకును.

# చైనా స్త్రీలు - నాడు, నేడు

చైనా స్త్రీల స్థితి, వారిహక్కులు, వారిజీవితము తిన్నగా విచారిస్తే ఆ దేశములో స్త్రీగా పుట్టడము కంటే ఇంకో గొప్ప దురదృష్టము వుండదని ఒప్పుకోనవలసివస్తుంది. ఆడుపిల్లలను పెంచడానికిగానీ, విద్యాబుద్ధులు చెప్పించడానికిగానీ వారు దండుగచే వుద్దేశంతోనే వుంటారు. ఎందుకంటే ఆవిడ త్వరగానే ఎవరిసొమ్మో అయిపోతుంది - ఎవరికో వివాహం చేయబడుతుంది. చైనీయుల్లో అతిబాల్య వివాహాలు సర్వసాధారణము; అందుచేత కాబోయే భార్యాభర్తలు ఒకరినొకరుచూచుకొని జ్ఞాపకము వుంచుకొనే వయసు రాకముందే వివాహబంధాలచేత బంధింపబడుతారు. వారు తమ యావజ్జీవము దానికి లోబడివుండవలసిందే! చైనీయులపిల్లలందరు వారితల్లిదండ్రులకు బానిసలు - వారికి తప్పక ఎప్పుడూ లోబడివుండము - ఆచారము - తప్పనిసరి. వారు గతించినతరువాత కూడ వారిఆత్మలకు విధేయులుగానేవుండవలెను. ఈప్రకారంగా ఒకవంశంలోనివారు వారి తరతరాలవారికి వారిఆత్మలకు విధేయులైవుంటూ వారి ఆచారాలప్రకారం నడచుకోనవలెను. అందుకే 'లక్షలకొలది చైనావారు లెక్కలేనంతమంది చచ్చినవారిచేతుల్లో వుంటా'రని వాడుక.

పితృకర్మల్లో పాల్గొనడానికి స్త్రీకి హక్కు వుండదు. చైనాలో స్త్రీకున్న హక్కంతా పిల్లలకనడానికి వంటింటిలో పనిచేయడానికి. పిల్లలను ఈ వుద్దేశాలతోటే చిన్నప్పటనుండీ పెంచుతూవస్తారు. స్త్రీపురుష భేదము వారన్నిటిలో చాలా శ్రద్ధగా గమనిస్తారు. ఏడేళ్లుదాటితే ఆ బాలికతో అన్నదమ్ములైనా దగ్గరకూర్చొని మాట్లాడకూడదు. అది నిషేధము! స్త్రీపురుషుల దుస్తులుకూడ ఒకేచోట ఎండలో వేయకూడదు!! ఇంటివారంతా - స్త్రీపురులు-కలసి ఒకేచోట తేనీరు త్రాగనే త్రాగరు. ఆలా చేయడము అనాచారము!

చైనా, ఎంత సహజసంపదలతో తులతూగుతూవుండేదేశమో, నిరంతర కాకటము చేత అంతఘోరంగా బాధపడేదేశం. దారుణమైన ఆకలి బాధకు ఓర్చుకోలేక చనిపోయిన వారి శవాలు ఒక్క షాంగేనగర వీధుల్లోనే ఏటేటా యిరవైఅయిదు వేలకంటే ఎక్కువగా దొరుకుతాయట! ప్రపంచములోకల్లా జనసమ్మర్దమైనదేశమై, ఆషాంగే వంటి పట్టణాలుఎన్నోవున్న చైనా దేశమంతా ఈవిధంగా సంవత్సరానికెంతమంది ఒక్క ఆకలిబాధచేతనే మరణిస్తారో తలంచుకుంటే భయంకరంగావుంటుంది. ఈఆకలి బాధకు ఓర్వలేక ఎంతోమంది తమ ఆడుపిల్లల్ని అమ్మివేస్తుంటారు. ఇది వారికట్టే లాభకరంగాదు కాని అప్పటికి పొట్టనింపుకోడానికొన్ని అణాలు వారికి దొరుకుతవి. ఈ అమ్మకం ఘోరంగా వుంటుంది. ఇటువంటివారిని మారులకొద్దికొని వ్యభిచారగృహాలు సాగించేవాళ్లు ఒకచోటనుండి ఇంకోచోటికి యీదిక్కులేని ఆడపిల్లల్ని మందలుమందలుగా తీసికొనిపోతూవుంటారు. దారిమధ్యలోకలిగే యమయాతనలకన్నింటికీమిగిలి బ్రదికినవారంతా వ్యభిచారగృహాలు చేరినతరువాత చక్కగా పోషింపబడుతారు-వ్యభి

ఏ చైనీయుడైనా 'నీకు సంతాన మెంతమంది?'
అని ప్రశ్నిస్తే కూతుండ్ర మాట ఎపుడూ
లెక్కించడు. పైగా ఎంతో కష్టంతో—
'దురదృష్టవంతులు ఇంతమంది కొడుకులు'
అంటాడు. ఆ దురదృష్టవంతుల పట్టీలో
ఆడు సంతానం వాసనైనా వుండకూడదు.

చ

రా

చారపిశాచమువాతపడడానికి. శరీర పాటవముతగ్గి ఆ పిశాచము దయకు దూరులై, ప్రపంచములో తమ్ము జూచి ఆయ్యోఅని సానుభూతియైన చూపు ప్రాణికూడలేక ఎన్ని జీవితాలు ఎంతదారుణ దారిద్ర్యంపాల పుతవో వర్ణనాతీతము.

ఇదంతా చూచినవారికి చైనా వారి అతిబాల్యవివాహాలు ఆ పరిస్థితుల్లో నయమేననిపించుతుంది. వివాహానికిముందు వధూవరుల తలిదండ్రులు ఒకచోట చేరుతారు. వివాహాలు నిర్ణయించుకుంటారు. వివాహమైనతరువాత తలిదండ్రులు ఆ అమ్మాయినిగురించి మరింత అశ్రద్ధ వహిస్తారు. తమ సొమ్ము గాదని ఆవిడను పోషించేభారం తగ్గిందికదా అని సంతోషిస్తారు.

వివాహానంతరం స్త్రీల నిర్భంధాలు ఎక్కువ అవుతవి. ఆతరువాత ఆవిడ బైట తలచూపడానికి గాని, ఏకోదరులైన అన్నదమ్ములతో మాటామంతీ ఆడుకోడానికి గాని వీలుకాదు. పోనీ భర్తయినా గౌరవిస్తాడా అంటే అటువంటి దేమీవుండదు. కన్ఫ్యూషియస్ సిద్ధాంతాలప్రకారం భార్యను గౌరవించవలసిన బాధ్యత భర్తకులేదు; ఆవిడకు ఏమిట్లో నా సమానహక్కు అనేమాటకూడా వుండదు. వివాహముఅయిన తరువాత వధువును అత్తగారింటికి తీసికొనిపోయేముందుగా తలిదండ్రులూ బంధువులూ అంతాచేరి అమ్మకానికివచ్చిన ఓ గుఱ్ఱములాగ ఆవిడలోని మంచినీ చెడ్డనీ తర్కిస్తారు. ఆతరువాత ఆ మెను పల్లకిలో అత్తగారింట్లో విడిచివస్తారు. అపుడు వచ్చిన బంధువులంతా వధూవరులను గాకుండా వారల తలిదండ్రులను జరిగిన వివాహానికి అభినందిస్తారు. కూతురి పోషణభారం తగ్గినందులకు తలిదండ్రులు అభినందన పాత్రులు! వారింట్లో పనిచేయడానికి కొత్తవ్యక్తి వచ్చినందులకూ, వారు చచ్చిన తరువాత పితృకర్మల నిర్వహించడానికి కావలసిన కుమారులనుకనే మనిషిని సంపాదించినందులకూ అత్తమామలు అభినందన పాత్రులు!! వధూవరులకు అభినందనాలు ఎందుకులేవంటే వారికి భావి సౌఖ్యమూ, వ్యక్తి స్వాతంత్ర్యమూ వారు కలలోకూడా అనుకోలేరుగా!

ఏదో అదృష్టమువుండి పెళ్లి జరిగినతరువాత భార్యాభర్తలమధ్య ప్రేమ అభివృద్ధి అయితే వారెపుడు కాని ఇతరులతో తామొకరినొకరు ప్రేమిస్తామని చెప్పకోకూడదు. పోనీ ఎవరో గ్రహచారవశాత్తున 'మీ యిద్దరిమధ్య ప్రేమవుందటనే' అంటే భర్త తనకేలేదని దబాయిస్తాడు. పెళ్ళాం ఎన్ని ప్రతిజ్ఞలైనాచేసి ఎంతకష్టమైనా నైనా వాదించి భర్తను ప్రేమించడములేదని నిరూపించడానికి పాపంఎంతో కష్టపడుతుంది. అలా చెప్పవలసిందని పెద్దల ఆజ్ఞ; శాస్త్రాలశాసనమూ.

పాశ్చాత్యులంతా ప్రాణప్రదంగా పరిగణించే ప్రయిమెసీ (ఏకాంతము; మరుగు) చైనీయుల్లో, మందుకు కూడ కనిపించదు. వారికదంటే ఏమిటోకూడా తెలియదు. తమ జీవితాల్లో వారు తమయిండ్ల వాకిళ్లుకూడా మూసివుంచరు. బజారులో వెళ్ళేవాళ్లు వారికిష్టముంటే లోపలవచ్చి కూర్చొని ఇంట్లోటి వారి సంభాషణలుకూడా విని వెళ్లు

కుంటారు. ఇదికాక భార్యాభర్తలు కలహించినా, లేక ఏదో విషయాన్ని గట్టిగా మాట్లాడుకున్నా యిరుగుపొరుగువారే గాకుండా దారివెంబడి వెళ్లేవారంతా లోపల సగౌరవంగా దయచేస్తారు. అడిగినా అడగకపోయినా ఆ జగడములో ఆసంభాషణల్లో చేరుతారు. ఇష్టమువచ్చిన సలహాలుకూడా యిస్తుంటారు. చైనీయులు తమయిళ్లలో పిల్లలు పెద్దలు, అంతాకలసి బస్తాలలాగ విచక్షత లేక కుప్పలుకుప్పలుగా వుంటారు. రాత్రుల్లో నిద్రించడానికి సౌకర్యాలు వుండవు. మానవ శరీరం ఎన్నివంకరలు తిరగలదో, అన్నిరీతులూ వారు పడుకుంటారు. వాళ్లయిళ్లల్లో నిద్రపోవడం అరుదు. తలుపుల దబదబాలు, కుక్కల మొరగడాలు, గాడిదల సకిలింపులు కోళ్ల కలకలాలు రాత్రంతా నిద్దరను దగ్గర చేరనీకుండా వుంటవి.

గొప్పకుటుంబంలోనివాళ్లు, ధనవంతులు మాత్రమే పురుషులలాగు కోటుధరిస్తారు. కాళ్లుమాత్రం చైనా స్త్రీలందరికీ చిన్నప్పటి నుండి చిన్నగా కావడానికి అదుమబడివుంటవి. పాపం, ఈవిధంగా చాలమంది కాళ్లు దేవుడిచ్చీకూడ లేని కుంటివాళ్లలాగు నిలొప్పలేక సరిగా నడువలేక నానాబాధలు పడుతారు. కొందరు పూర్తిగా గౌనులు తొడుగుతారు. ఆగుడ్డలు చాలా అందంగా ఆడంబరంగా వుంటవి. కాని చలికీ, ఎండకూ, అవి ఏమాత్రము ఉపయోగపడవు.

చైనా స్త్రీలలో ఇంతవరకు స్వాతంత్ర్యము లేకున్నా ధనవంతుల యిళ్లలోను గొప్పకుటుంబాల్లోను చాలామంది బానిసలను వుంచుకుంటారు. వారు మగవాళ్లలాగే అన్నివైభవాలూ అనుభవిస్తూ బానిసలపైన అధికారము ఛెలాయిస్తారు.

చైనాలో పెద్దపెద్ద నదులు చాలావున్నయి. వానిమీద చిన్నచిన్న ఓడల్లో భిక్షకవృత్తి చేసుకుంటూ, భర్తలతో, పిల్లల్తో జీవిస్తుండే యిల్లాండ్రువుంటారు. భూమిమీదలాగే ఓడల్లో నిర్భయంగా, నిపుణంగా సంసారాలు జరుపుకుంటూవుంటారు.

పురుషులు స్త్రీలుకూడా నలుగురిలో గౌరవంపొందాలని పడిచస్తుంటారు. తాముచేసేది ఎంతతెలివితక్కువఅయినా సరే. నలుగురిచేత శెబాష్ అనిపించుకుంటేచాలు. దీనికి ఈక్రింది వృత్తాంతం చక్కని నిదర్శనం. చౌ అనే ఆవిడ విధవ; ధనవంతురాలు. ఆవిడకొడుకు పోహో దుబారామనిషి. అందుచేత ఆవిడకో భయంకలిగింది. తానుచావకముందే వుండేదబ్బంతా వాడు ఖర్చుచేసివేస్తే? తరువాత తనఅంత్యక్రియలు వైభవంగా జరగడానికి లోపము వస్తుందే! ఆలాఅయితే నలుగురిలో ఎంతఅవమానం? అదిభరించేదెలాగ? కాబట్టి ఆ అవమానం తప్పించుకోవాలి. పైగా పైలోకములో ప్రదర్శించడానికి అంత్యక్రియలనాటికి కావలసిన సామగ్రినంతా సమకూర్చుకోవాలి. ఇలాచేయడానికో చక్కనిమార్గంవుంది. తాను బ్రతికివుండగానే తన అంత్యక్రియలు స్వయంగా, అతి వైభవముతో చేయించుకుంటే! చౌ అలాగే చేసింది. చక్కని శవపేటిక, అతి సుందరముగా దాన్ని మోయడానికో పల్లకీ ఎంతోకర్చుతో తయారు చేయబడినవి. దాన్ని మోయడానికి సేవకుల ఏర్పాటుచేసినారు. అంత్యక్రియలనాడు జరుగులాగున అతి వైభవంగా విందుజరిగింది. నిర్ణీతకాలానికిసరిగా చౌ శవపేటికలో కూడా ఊరంతా సంతోషముతో ఊరేగింది. చుట్టూ గుండెలుబాదుకుంటూ ఏడుస్తూ బంధువులంతా వెంబడించినారు. అందరికీ ఎంతో ప్రతిష్ఠదక్కింది. పోహోకుకూడా చెప్పరాని గౌరవంకలిగింది. అంతేకాదు. పోహో ఆతరువాత మూడేళ్లవరకు దుఃఖము (Mourning) లో వుండవలసివచ్చింది.

## నేడు

ఇదంతా ఎప్పటిమాటో కాదు; ఇప్పుడుకూడ కొంతవరకు చైనా ఇలాగే వుంది. అయినా చాలా మార్పు వచ్చేసింది.

# చైనా స్త్రీలు — నాడు, నేడు

నేడుజరిగే చైనా జపాను యుద్ధము ఏలాపరిణమించినా, దీని ఫలితాలవల్ల చైనా ఏగతిపట్టినా ఒకటి మాత్రము ధృవము. చైనాలోని స్త్రీవుద్యమము విజయధ్వజము చేత పట్టుకొని ముందుకు నడుస్తూవుంది; ఎంత క్షీణస్థితిలో వున్నా, ముందు వలెనే చైనా జాతీయతోద్యమానికి దోహదం కలిగిస్తుంది.

ఆధునిక చైనాలో స్త్రీస్వాతంత్ర్యోద్యమము అద్వితీయమైనదని నిస్సందేహంగా చెప్పవచ్చు. అనాదిగా చైనాస్త్రీలు బానిసత్వములోపడి దరిగానక అవస్థపడేవారు. రాజకీయాల్లో గాని, ప్రజాహిత చింతలో గాని వారికి చోటుండేది కాదు. ఇది క్రిందటి ముప్పదియేళ్ల వఱకు. ఈస్వల్పకాలములో ఈ దురభిప్రాయాలను, బానిసత్వాన్ని స్త్రీఉద్యమము నిర్మూలించింది.

ఈముప్పదియేళ్లలో స్త్రీముక్తికి మూలపురుషులై ముగ్గురు ప్రసిద్ధ వ్యక్తులు బైలుదేరినారు: చైనా ఫ్లోరెన్సు నైటింగేల్ అని పిలువబడు డాక్టరు మేరీ చాంగ్, సన్ యెట్ సేన్ సతి, చియాంగ్-కై-షేక్ సతి. ఆధునిక చైనాస్త్రీల వుద్యమమంతా కడపటియామెలో మూర్తీభవించివుంది.

స్త్రీ స్వాతంత్ర్యోద్యమము స్త్రీలే ప్రారంభించిరవడానికన్నా ఆధునిక చైనా నంతటి యభివృద్ధికి తెచ్చినవారు చైనా స్త్రీలే అంటే సబబుగావుంటుంది. ఈవుద్యమము నాగరికతావిజ్ఞానాల్ని పునరుద్ధరించడమే గాకుండా దేశమంతటా వ్యాయామాభివృద్ధి చేసింది.

భారతీయువనితలు చైనావారి వద్దనుండి నేర్చుకోవలసిన విషయము ఒకటివుంది. ముప్పదియేళ్లకు ముందువరకే చైనాస్త్రీలు పాలిపోయినముఖాలతో, కట్టిముద్దలుగా చేయబడ్డ పాదాలతో వున్నారు; వారి బ్రతుకంతా పిల్లలకనడానికి, వంటింట బానిసగా వుండడానికే అనుకోడానికి వీలులేదు. అదంతా మారిపోయింది. ప్రాశ్చ్యప్రపంచంలో చాలా అభివృద్ధి చెందిన ఏ దేశపు స్త్రీలకు వారిపుడు వెనుకబడరు; సరిగదా, ధైర్యసాహసాల్లో వారితో తులదూగేవాళ్లూ తక్కువే.

ముప్పదియేళ్ల క్రింద గౌరవనీయమైనకుటుంబములోని స్త్రీలెవరూ బజారులో కనిపించేవారు కారు; వారిజీవితమంతా పిల్లలతో, కుట్టుపనులతో జరిగిపోయేది. అపుడు బైటతిరిగేవారంతా యే బానిసలో కూలివాళ్లో.

నేడు వారు ప్రవేశించనిచోటు లేదు: అంగళ్లలో, ఆఫీసుల్లో, కర్మాగారాల్లో, బ్యాంకుల్లో పని చేస్తున్నారు. న్యాయవాదులుగా, డాక్టర్లుగా, పత్రికావిలేఖరులుగా వుపాధ్యాయినులుగావుంటున్నారు. పాశ్చాత్యపద్ధతుల అవలంభించి వారి సాంఘికజీవితాన్ని కూడ అవలంభించి తిరుగుతారు. వుపన్యాసాలిస్తారు; దేశోపకరములైన వుద్యమాల్ని యేర్పాటుచేసి నిర్వహిస్తారు. పురుషులకంటె మిన్నలుగా ఫోలోవంటి ఆటలందు కూడా పాల్గొంటారు. ఇటీవలనే చైనా నుండి ఒక ఆమె ఇంగ్లండులో రాయబారిగావుండడానికి పంపబడినది — ప్రాచ్యదేశాల్లో అపూర్వమైన విషయము! ఆధునిక చైనా, అమానుషముగా స్త్రీలకు విధింపబడిన నిర్బంధాలను సహించదు. సంస్కారాలకు కూడా ఒప్పుకోదు. స్త్రీలెంత సాహసానికైనా పూనుకుంటారు. ఒక వృత్తాంతాన్ని చూడండి.

గత చైనా జపాను సంగ్రామములో జరిగిన సంగతిది. చేపాయి ప్రాంతాల్లో, కందకాలన్నీ స్త్రీ సైనికుల చేతుల్లోనేవుండేవి. వారికి గావలసిన సైనికదుస్తులన్నీ వారే యిళ్లలో తయారుచేసుకొన్నవే. జపానుసైన్యం తమ్ము ఎదుర్కొని చీకాకుపరచింది. స్త్రీలంతా మరల కూడుకొని, ఆరితేరిన జపానుసైనికుల మీద దుర్గావతారాలలాగు పడితే వారు, ఆ వీరనారీమణుల ఉద్ధతికి తాళలేక తుపాకులు యుద్ధభూమిలో పడవేసి ధాడుతీశారట! ఇటువంటివెన్నో!

చైనాలో యీ వుద్యమానికి పునాది వేసినవారూ, అధిపత్యము వహించినవారూ స్త్రీవిద్య విరివిగా వ్యాపించకపోతే మోక్షము లేదని

గ్రహించినారు. వెంటనే దాని వ్యాపకానికి పూనుకున్నారు. 1907 లో చైనాఅంతా 12000 మంది బాలికలుమాత్రమే ప్రాథమికపాఠశాలల్లో చదివేవారు! 1918 లో అది 2,15,000 వఱకు పెరిగింది. 1931 లో ఆ సంఖ్య 16,53,026 అయింది. నేడదే మూడింతలయింది. అంటే ప్రాథమికపాఠశాలల్లో చదివేపిల్లల్లో నూటికి 54 మంది బాలికలు అన్నమాట.

క్వాంగ్‌టంగ్ స్త్రీసమాజము వారు తప్పక కావాలనే క్రింది ఆశయాలుచూస్తే పూర్వాచారాలకు, వారెంతదూరము వచ్చారో తెలుస్తుంది.

చట్టదృష్టిలో, సంఘములో స్త్రీలకు పురుషులతో సమానమైన హక్కులు.

స్త్రీకార్మికులకు పురుషులతో సమానమైన కూలి, వారి ఆరోగ్య సంరక్షణకుతగిన రక్షణ చేకూర్చడానికి కార్మికసంఘాలు.

వ్యభిచారనిర్మూలము.

వివాహవిషయమున సంపూర్ణస్వాతంత్ర్యము.

కుమారులతో సమముగ కుమార్తెలకు వారసత్వపుహక్కు.

పల్లెటూరి - కర్షక - స్త్రీలకు విద్యాసౌకర్యములు.

1931 వ సంవత్సరములో నిర్మింపబడిన చైనారాజ్యాంగము కూడ, స్త్రీపురుష, జాతిమతభేదములేక చైనా చట్టదృష్టిలో అందరుసమానులు; ప్రతివారికి ఓటింగు హక్కువుంది; అని నిర్ణయించింది.

ఈవిధంగా చైనాలో స్త్రీ పుద్యమం సంపూర్ణవిజయంపొందింది అనవచ్చు. వారి నినాదు ఆకర్షించునవి రాజకీయాలు గావు; సాంఘిక వ్యవహారాలూ, విద్యావ్యాప్తీ. భారతదేశములో స్త్రీపుద్యమము ఇంకాయెంతో అభివృద్ధిపొందవలసి వుంది. అందుచేత ఈ క్రిందివిషయం అంతా గమనించాలి.

చైనాలో స్త్రీపుద్యమం ఇంత త్వరగా విజయంపొందిందంటేదానికి కారణము లేకపోలేదు. ప్రారంభం నుండీ ఈపుద్యమానికి పురుషులంతా సానుభూతి చూపుచువచ్చినారు; ప్రభుత్వముసాయపడుతూవచ్చింది. మనదేశంలో ఈ రెండూ తక్కువగా కనపడుతున్నవి.

ఇంకోవిషయము. చైనా స్త్రీలు వ్యాయామరంగంలో అమిత ప్రసిద్ధి చెందుతున్నారు. అందులో వారి అభివృద్ధి నానాటికీ ఎక్కువౌతూ వుంది. మనదేశములో ఇదికూడా చాలా అభివృద్ధి పొందవలసివుంది.

---

ఆంధ్రులమగు మనము, కొంతవఱకు అదృష్టవంతులము. యావద్ భారతదేశములో నేభాగమైనను ఏకభావమును సంపాదించుకొన నర్హమన్న నది ఆంధ్రదేశమే. మనలో కేవల పూర్వాచారపరాయణత్వము ఎక్కుడుగా లేదు. మన యాధ్యాత్మికదృష్టియు మానసిక వైశాల్యమునంద తెఱిగినవే. మన సాంఘిక ప్రకృతి, పరిజ్ఞానము నేటికిని సజీవమే. మన నైతిక విజ్ఞానము, భావనలు దురభిమానరహితములు. మనలో స్త్రీలు ఇతరత్రకంటే స్వేచ్ఛ గలవారు. మన మాతృభాషయే మనము హిందువులమైనను, మహమ్మదీయులమైనను క్రైస్తవులయినను మనల నొక్కటిగా బంధించుచున్నది. సత్యాన్వేషులును సంఘసేవానిరతులునగు స్త్రీ పురుషులను విశ్వకళాపరిషత్తు తయారుచేసినయెడల మనదేశములో నైతికాధ్యాత్మిక పునరుద్ధరణము తప్పక కలుగును. దీనికి మీరు యత్నింతురా?

సర్. ఎస్. రాధాకృష్ణన్.



# మీ రెండు చర్మములను గురించి శ్రద్ధవహించుము

ముడుతలకు గీరలకు కారణము క్రిందిచర్మమున గలదు. అచటగల తైలగ్రంథు లెండిపోయి క్రింది చర్మము క్రుంగి గీరలు ముడతలు మొదలగునవి యేర్పడును. ఎండకెండి ధూళితోనిండి గరకైనది పై చర్మము. గావుననే రెండుచర్మములనుగూర్చి ప్రత్యేక శ్రద్ధ దీసికొను టెందులకో యెఱుగగలవు.

**గీతలును ముచ్చలను ముడుతలనుమాపును:**
ప్రతిరాత్రి పాండ్సుకోల్డుక్రీమ్ పూసిన క్రిందిచర్మమును బాగుగజేసి నూతనశోభ వచ్చును.

**గరుకు చర్మము కూడ మాయును:**
ప్రతిరాత్రి పాండ్సుకోల్డుక్రీమ్ పాండ్సు వానిషింగ్ క్రీములోకూడ పూసిన–ముఖమునకు మెడకు చేతులకు కూడ పూయుము–ఉదయమున చర్మము నూతనమై మృదువుగనుండును.

ఉచితము: దీనిని నేడే పంపి పాండ్సు రెండు క్రీముల ట్యూబులను పాండ్సు ఫేసుపౌడరు మాదిరులను ఉచితముగా బడయుడు. (చెక్ చేడు) నేచురల్.......రోజ్ క్రీమ్.........బ్రునెట్......

డాడ్జి అండ్ సెయ్‌మర్ లిమిటెడ్,
3, విటెట్ రోడ్డు, బొంబాయి.

పేరు..................................
చిరునామా........................No. GL. 20




కోకోనలు మీ తలవెండ్రుకలను నున్నగ నల్లగ మృదువుగ, ప్రకాశముగ ఉండేటట్టుచేస్తుంది. ఏ స్త్రీయైనా, తలవెండ్రుకలు చక్కగా లేకపోతే, అందముగ కనుపించదు. తనజుట్టు నిడుపుగ మెత్తగ, నున్నగ, నల్లగ ఉండాలంటే కోకోనలు ఎల్లప్పుడు ఉపయోగించాలి.

కోకోనలు నెత్తిని శుభ్రముగనుంచి చుండు పట్టకుండచేస్తుంది. చిన్నతనమున తల నెరియుట, దువ్వుకొనునప్పుడు వెండ్రుకలురాలిపోవుట, మున్నగువాటిని ఆపుతుంది.




కోకోనలు శుభ్రమైన కొబ్బరినూనెనుండి తయారుచేయబడినది. దానిలో నెత్తికిని మెదడుకును, తలవెండ్రుకలకును మంచిపనిచేయు మూలికలసారము కలిసివుంది. కోకోనలు వాడి తలవెండ్రుకలను చక్కగను దువ్వుకొనుట కనుకూలముగను చేసుకొనండి.

## కోకోనలు

కలకత్తా కెమికలుకంపెని లిమిటెడ్ వారిచే తయారుచేయబడినది.

# కాశ్మీర మజిలీలు

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు

( నాటి రేయి )

పండువెన్నెల!

బంగారుబొమ్మవలె కాంతిలు మందిరముపై కన్నువేసి, శశాంకుడు మురియుచుండెను. సూర్యుడస్తమించువఱకు కనకవసనసుందరివలెనేతోచిన ఆలయము యామినీ సమయమున దువ్వలువదాల్చిన తలోదరిచాడ్పున చూపట్టుచుండెను. ఇప్పుడది క్రొంగ్రొత్త తళ్కులతో తేజరిల్లుచున్నది. బహుళభావములను చిత్రయవనికపై చిత్రించుచున్నది. పాలవెల్లిలో తానమాడు పండుముత్తెపుచందమున, శుభ్రహృదయమున నుదయించిన రంగారుబంగారు తలపురేకపొలుపున, మల్లెరాశిలో తలసూపు గంధఫలిపగిది, వజ్రముల గుంపుననిలిచిన నవభర్మశలాకభంగి, పాలరాళ్లలో వెలుగు దీపికళికకరణి, చిరునవ్వులందు శోభిలు ముద్దుమోముకైవడి, ధవళగిరిపై పులకితాంగియైతోచిన వరూధినివడుపున, తెలిమబ్బుపై తళ్కొత్తిన అపరంజి రేఖలీలను, కల్వచెల్వలందు జొచ్చిన పైడిబొమ్మవలె, మింటిపైనిలిచిన విద్యుల్లతలీల, హంసతూలికాతల్పముపై తడసిన నగుమోము యిల్లాలిచొప్పున మందిర మగపడినది. కరువలితాకుడున మందస్వర మొనరించుచు, నల్లన కెరటములు తలసూపులతె సరోవరసీమంతిని అర్ధరేయి చందురునుద్దేశించి గుసగుసలు సలుపుచుండెనని యూహించితిని. ఆహా! ఎట్టి మనోమోహనదృశ్యము! అందుండి కదులుటకు నామానస మొప్పలేదు.

తులసీరామాయణములోని చరణములను దాదాజీ మెల్లగ నాలపింపదొడంగెను. విశ్వహృదయముపై బిడ్డవలె పన్నుండిన ప్రశాంతమించుక కదలినది. మనోవీథులందా మధురరవము మెల్లన ప్రవేశించినది. లలితలతపై బిలబిలలేచు పూవులట్లు మానసమున తీపితలపు లుదయించినవి. నాల్కమీఁది తీపికంటె చిత్తమందలితీపి ఎన్నిమడుంగులు మిన్నయైనదో ఆముహూర్తమున గుర్తించితిని. కిక్కురుమనక తక్కుంగలవారను హాయి ననుభవించుచు, కనులపండువొనరించు కౌముదీసామ్రాజ్య నవలోకించుచుంటిమి. నిముసములో బుడంకాయితీఱు వేగైనది! తలవంచినాడు; కనులు మూసినాడు. గభీర యోచనమున బుడుంగుమనినాడో, తన్మయత్వమున మునింగినాడో, నిద్దుర కౌగిట జేరినాడో ఎఱుగను. ఆప్రేమసంశ్లేషమున పండువెన్నెలబోలు కలలు కనుచున్నాడు కాబోలు! చూచుచుండగ నిటునటు జోగసాగినాడు. స్వప్నజగతిలో తూగుటుయ్యాల లూగుచున్నాడు. కాబోలు! పిచికిగాని యదృష్టమెట్టిది! ఇంతలో విఱుచుకొని చివాలున వాడు ప్రక్కనున్న చెరువులో కూలబడినాడు! పాటను పుటుక్కునత్రుంపి తక్షణమే



బెర్లిన్ సమీపమున స్ప్రీవాల్డునందు శరత్కాలమున కాయగూరల రవాణా కాలువల మూలమున జరుగుచుండు టిందు గానవగును.



శ్రీమతి జ్యోత్స్న బెన్ శుక్ల
హరిపురము (గుజరాత్) లో జరుగుచున్న
51 వ జాతీయమహాసభ (కాంగ్రెసు)
ఆహ్వానసంఘ కార్యదర్శి.



శ్రీమతి ఇందిరాజోషి, శ్రీమతి నిర్మలసమర్థ గార్లు
ఇటీవల టోకియోలో జరిగిన అంతర్జాతీయవిద్యాసమ్మేళన ప్రతినిధులుగ నేగి
స్వదేశమునకు మొన్ననే తిరిగివచ్చిరి.

దాదాజీ నీటిలోనికి లంఘించినాడు. తోతువన్ని నిలువులో లేదు. కాని పడినవాడు పొట్టిపిచికి! నిలువులోతు, వానికి నూరునిలువులై పోవునుగదా! పైగా వాడు సామాన్యస్థితిలో పడలేదు. ఏమే మోకల లల్లుకొనుచుండెను! కాసారసీమంతినితో సయ్యాటలాడ వాడట్టి పనికి గడంగినాడనుట కెట్టియాధారములు కానరావు. గిన్నెలోపడిన చక్కెరగోళీవలె నిముసములో తటాకమున వాడదృశ్యుడై పోయినాడు. వానికై దాదాజీ బుడుంగున జలగర్భమున మునింగినాడు. రెప్పపాటుకాలము కడచినది. అంతలోనే, మాహృదయమున నంతకుమున్నులేచిన మహోన్నత స్వర్గసౌధములు నేలగూలి దురంతమైనగగ్గోలులో దొరలినవి! ఇరువురలో నెవ్వరును కానరాలేదు. మాచిత్తములట్లు కాసారచిత్తము సంక్షుభితమగుచున్నది! ఉవ్వెత్తుగ కెరటములు లేచినవి! ఆకస్మికముగ తక్కుంగల వారము చెరువులో దుమికితిమి. నీటిలో ఘోరాన్వేషణము! ఘోరసంఘర్షము!

కొంతసేపటికి తలమెత్తిచూచితిని, పొట్టిపిచికి మెల్లగ నొడ్డుమీది కెగబ్రాకుచున్నాడు! చెరువులోని సంకులమునుగని అల్లకల్లోలమునువిని గుడినుండి ఇరువురు వ్యక్తులు పరుగెత్తుకొనివచ్చి, "క్యాహువా? క్యాహువా?" ("ఏమైనది?" "ఏమైనది?") అని యడిగిరి. "కూఛ్‌నహీ; డర్‌నహీ" ("ఏమీలేదు; భయములేదు") అని బదులు చెప్పితిని. నీటిలోమునిగిన తక్కిన మువ్వురికై తడసితిని. నిముసములో దాదాజీ, సురాజ్, సింగులు ఒకరిగడ్డమునొకరు గట్టిగబట్టుకొని (నీటిలో నొకరినొకరు బుడంకాయ యనుకొని కాబోలు) పెనగులాడుచు పైనదేలిరి. "వదలుడు! వదలుడు! వాడు యొడ్డున నున్నా"డు అనియఱచి గట్టున కీదుకొనిపోతిని. సింగు మిగుల నుక్కిరిబిక్కిరి యైనాడు. కండ్లుమూసికొని దాదాజీగడ్డమును గట్టిగబట్టుకొని, చిత్తమువచ్చినట్లు "రఘునాయించి" ఊపివేయుచున్నాడు. పాపము! చిరకాలమునుండి పెరిగి పెద్దదియైనగడ్డము ఇంచుమించుగ పునాదులతోకూడ నూడివచ్చినది! "ఛోడ్! ఛోడ్ రే!" అని ముసలివాడు అఱువసాగినాడు. వెన్కనుండి సూరజ్ సింగు గడ్డమునుబట్టుకొని సత్తువకొలది దూరమునకు బరబరలాగి దాదాజీని రక్షించినాడు. "సశేష"మైన దాడీ (గడ్డము)తో ముసలివాడు తీరమును జేరుకొనినాడు. సింగు తెప్పిరిలి ఈదుకొనివచ్చినాడు. సూరజ్ తోడ్తోడనే దరిజేరినాడు.

అందఱము చెప్పనలవిగాని హైరాను బడితిమి. ఈ విశృతసంఘటనమున కంతకు కారకుడు శ్రీ బుడంకాయిగాడు! గట్టుపై కదలమెదలక పరమమునీంద్రునివలె వాడు కూర్చుండెను. "ఏమిరా! ఇంతపనిచేసితివి?" అని గద్దించి పల్కితిని. "దూషణభూషణతిరస్కారములు శరీరమునకుగాని ఆత్మకుగా"దని విశ్వసించువారిలో పొట్టిపిచికియొకడు. నాప్రశ్నకు వాడు జవాబు చెప్పలేదు. సరికదా కన్నెత్తియైన నన్ను చూచినాడుకాడు.

"మాటలాడవేమి? ఇంతపనికేల నొడిగట్టితివిరా?" అని యడిగితిని. నన్ను స్వగతమున వచింపనిచ్చి వాడట్లే శిలావిగ్రహమువలె కూర్చున్నాడు. క్రింద జతికిలపడి చివాలున వాని ముఖమెత్తి మరల నట్లే ప్రశ్నించినాను. తనచూడ్కిని వాయూర్ధ్వదిశకు బిగించివేసినాడు. మాటవలనగాని చూపువలనగాని వాని ప్రత్యుత్తరము పడయజాలనైతిని. నన్నూ నామాటనూ వాడు గణించినరీతికి మిగుల గుపితుడనైతిని. వానిచెవులు పట్టుకొని నులిమివేయ నుంకించితిని. చెవిదాపున జేయిపెట్టినంతన, కెవ్వుమని మొగమును మిగుల వికృతముగావించినాడు. చెప్పవద్దూ, వాడు కెవ్వుమనినంతన, నే నులికిపడి, నాప్రయత్నమును మానుకొని చల్లగా వెన్కకుతగ్గితిని. కోరచూపులు చెరువుపై (అది తన్నుముంచినదని కాబోలు!) సారించుచు, గంభీరవదనుడై బుడంకాయ అట్లే కూర్చున్నాడు. మాలో నెవ్వరేమనినను, తన్నుగానట్లు ఏమియు జరుగనట్లు వాడు మిన్నకొనియుండెను. "స్వామీజీ! క్యాహాల్? కహియే!" (స్వాములూ! ఏమినమాచారము? చెప్పండి") అని దాదాజీ వానిమొఖముపై తనమోముంచి ప్రశ్నించినాడు. "అట్లు సాహసింపకుము. కోపించినగడ్డమును వాడుకొరికివేయును. జాగ్రత! వెనుకకు రమ్మ" అని సింగు ముదుసలిని హెచ్చరించినాడు. "బహుత్ అచ్ఛా! భయ్యా! తమాషాఖూప్ అచ్ఛాహై!" అని దాదాజీ కడుపుబ్బ నవ్వసాగినాడు. సింగ్ సురాజ్‌లు కూడ నవ్వు నాపుకొనజాలరైరి. ఆతిథ్యమిచ్చి ఆదరించిన ఈయమాయికులకు పాడు పిచికిగాడు తెచ్చిపెట్టిన నేటిదురవస్థకు మిగుల దుఃఖించి సిగ్గుపడితిని. నాముఖలక్షణములనుబట్టి దాదాజీ నాయభిప్రాయమును కనిపెట్టినాడు. 'తమాషాగాని మఱేమీ జరుగలేదు' అని వృద్ధుడు నవ్వుచు నాతో చెప్పినాడు.

చలి తీవ్రముగ నున్నది. తసిడి ముద్దలైతిమి. ఇక నాటివేడుక ముగించి బసకు మరలిపోదలచితిని. కాని గుడినుండివచ్చిన పెద్దమనుష్యులు మమ్ము ఆలయముకడకు గొనిపోయిరి. సింగు మాకందఱికై పొడిగుడ్డలు తెచ్చినాడు. 'బసకుపోయి బట్టలు తెమ్ము' అని బుడంకాయితో చెప్పితిని. పిచికిలేచుటకుమున్నే దాదాజీ పరుగుపరుగున బోయి నావలువలు తెచ్చియిచ్చినాడు. వస్త్రములుమార్చి రగ్గులు కప్పితిమి. ఇంతలో పిచికిగాడు బసకుపోయి దాదాజీగృహమందలి పెద్ద 'చోఁడ్' (ఇదిరొజాయికంటె దట్టముగానుండును. దీనికి 'సిరిక్' అను మాఱుపేరుకలదు)ను కప్పుకొనివచ్చి మందిరప్రాంగణమున మాయందఱినడుమ జతికిలపడినాడు. చంటికుఱ్ఱని జేరదీసి బుజ్జగించునట్లందఱు నవ్వుచు ముద్దుముద్దుగా పిచికిని దువ్వసాగిరి. తన్నుగానట్లుండి బుడంకాయిగాడు కంఠమెత్తి ఏమేమో నోటికివచ్చినపాటలు పాడసాగినాడు. అవి పల్లెలందు హిందూస్థానీయులు పాడుకొనుపాటలు. తెలుగునేలలో ప్రసిద్ధికెక్కిన ఏలపాటలు పోలునవి. సరళపదయుక్త

ముల్లై చెవులకు విందొనరించునవి. తీపితలపుల కాలవాలమై చల్లగ నవి యుల్లములో ప్రవేశించునవి. కాని పిచికిగాడు పాటలలో స్వంతగద్య గొంతచొప్పించి, రసభంగము గావించినాడు. నిరంతరాయముగ స్రవించు వెల్లువలో బెడ్డలువేసి వాడు నిష్ఠురుడని కినిసితిని. కాని వానిస్వంతకవనము దాదాజీ ప్రభృతులకు సంతోషము గలిగించెను. 'గీత్ అచ్ఛాహై, ఆవుర్ తుమారికవితాభి అచ్ఛాహై' ('పాట బాగున్నది; మఱి నీకవిత్వం కూడా బాగున్నది.'), అని మిత్రులు వానిని హెచ్చరించిరి.

ఇంచుక సేపటిలో బుడంకాయిపాట గుఱ్ఱులో లీనమైపోయినది. మిత్రులందఱు మందిరప్రాంగణమున మేనులువాల్చిరి. అల్లన నందుండి కదలిపోయి, కాసారతీరమున మఱొకవంక గూర్చుంటిని. నడిరేయి కడచినది. వసుంధరాదేవి సుషుప్తిమగ్నయై యున్నది. అనంతశాంతమవని నేలుచున్నది. అపుడపుడుమాత్రము చెరువు కడుపుమీది తరగల బుడిబుడినుడువులు మెల్లగ చెవిబడుచున్నవి.

నాటినిశి నిదురించుటకు నాకు మనసొప్పలేదు. నిద్రించి కడపినరాత్రు లనేకము లున్నవి; అనేకములుండును. కన్నులు మూతలుపడినపిదప నంతరంగమున గోపికలుపోలు స్వప్నములనేకాంచి, ఆనందింతుమని చెప్పలేము. ముక్కిడిరక్కసులపోలు కల లెన్నో మనసుపై దాడివెడలుట గాంతుము. మేలుకాంచి స్వప్నముల నల్లుకొననేర్చితిమేని, మనసు నన్యాయత్తమొనరించుకొనక చిత్తమువచ్చినతీరున మసలి, పోయిపోయి మొగిళ్ల చీడీలనెక్కి, నభోవీధులం దనంత నీలిమమున విహరించి ఎన్నెన్నివింతలనో విలోకించి, వానిని వశమొనరించుకొందుము. అనంతానందమున నోలలాడవలెననిన, నద్దమరేయి గన్నుమూయక విశ్వవిస్తృతమైన శాంతియందు మనసుంచి యోచనకు గడంగవలెను. ఆహా! ఆ యాలోచనమున నెంతహాయియుండును! కనివినియెఱుగని అద్భుతసృష్టి గభీరమైన యోచనయందే, శిథిలము కాని సమాధియందే కదా పొడసూపును! సాహితియందు తళ్కొత్తు దివ్యదృశ్యములట్టి మధుమయ మంగళముహూర్తమున, శాంతిమయ హృదయనందనమున నుద్భవించినవే కదా! హృదయవిభవము సాహితిలో నడుగిడునని ఎవ్వరెఱుగరు? కళాసామ్రాజ్యమున స్రవించు భావఝురులా ప్రశాంతసమయమందే యుదయించునుగదా!

అనంత విహాయసమున వేఱువేఱుచోటులందు మజిలీలుసలుపు శకుంతయాత్రికుని వలె మనుష్యమానసము విశాలవిశ్వమున నిచ్చమెయి విహరింపజాలునదయ్యు, కొండొక యాధారమునుండి అది పయనముసాగించుచో దాను వలచినపంథలను ముందే యూహించుకొని, క్రమయాత్రసాగించి, చిత్రవిచిత్రదృశ్యములను గనజాలును.

మక్కువమెయి ప్రకృతిమహిళను మనసులోని కాహ్వానించితిమేని, సారెచీరలతో స్వీయసామ్రాజ్యముతో నాప్రణయిని "ఆత్మార్పణ"మని అంతరంగమున ప్రవేశించును. ఈప్రేమ పరస్పరమై, పవిత్రమైనది. అమృతమయ ముహూర్తమున కనులుమూసికొని హృత్సింహాసనమున నాసీనయైన పట్టమహిషి దెస నాంతరంగికదృష్టిని సారించితిమేని, చూడ్కియందలి జిజ్ఞాసను, అనురాగమును గనిపెట్టి హాసన్ముఖియై, ఆసుందరి స్వీయ హృదయకవాటమును దెఱచి, అందు గాంతిలు స్వర్ణసామ్రాజ్యములోనికి స్వాగతమని, భావబంధురనిభృతిమున బహుభంగుల నలరించును.

కనినదృశ్యమును, కనినట్లే తోడ్తోడన వర్ణించుటుచితముకాదు. వర్ణించితిమేని, వట్టి ఫోటోగ్రాఫరుల మైపోదుము; కాఫీకొట్టు మొద్దుబాలురమగుదుము; మకిలినకలునకు చేయిజేసికొనినవార మగుదుము.

మనుష్యమానసము అనపత్యయైన ఆడుదివంటిదికాదు. తానందిన భావబీజమును ఆత్మగర్భమున పెంపొందించి, కొంతకాలమునకు ముద్దుకృష్ణుబోలు సుందరసృష్టిని గన జాలును. ఈయాంతరంగికసృష్టి వృద్ధికి కొంత సమయమవసరమను నంశమును మఱువ రాదు. ఈసృష్టివృద్ధి స్మృతిలో జరుగును. ఇందెన్నేని వన్నెలు, సొంపులు, సొబగులు తలొత్తును.

మానస మచేతనమైన ఇనుపపెట్టె వంటిదికాదు. పెట్టెలోనిసరుకు పెట్టినట్లే యుండును. మనసులోనిసరుకు అట్లుండదు. చూచినదిచూచినట్లు, వినినదివినినట్లు అందుండి వెడలదు, అది గోదా కేదారమువంటిదనినను, అనవచ్చును. చిన్నగింజ పడిన జాలును; బంగారుపైరు దానిలో నుదయించును. ఈపైరులో పెంపొందు వెన్నులను విలోకింపుడు. అందు వింతబెళ్కులీను భావపుంజములు వెలయుచుండును! నమ్ముడు— అంతరంగమున నణువుపడిన జాలును; అందుభావ బ్రహ్మాండమొండు తలసూపును.

భావిసృష్టికి హృదయక్షేత్రమున నేడొక భావాంకురము నాటుకొనవలెననుట స్పష్టాంశమేకదా! కనులెదుట కాంతిలుప్రకృతి జగదీశుని భావభాండారము. వలసినన్ని తలపు విత్తులనందుండి కైకొనుట కీశ్వరుడు మనకు నిండుహాక్కు నొసగినాడు.

మానసాంజలి ఘటించుటకెంతేని యలవాటు అక్కరైనది. విజ్ఞానాంకురములను ప్రకృతిదృశ్యములనుండియే కాదు. వివిధసంఘటనములనుండి, విభిన్నానుభవములనుండి గైకొందుము.

జిజ్ఞాసువునై పదునాల్గవయేటనే విజ్ఞానయాత్ర నారంభించితిని. పోయినకొలది దిగ్వలయమట్లు యాత్రాంగణము వృద్ధియగుచున్నది! నేగావించు యాత్రయందీ

కాశ్మీరమజిలీలు కొన్నిఘట్టములు మాత్రమే! వీనిలోని తుదిఘట్టములు గగనచుంబి హిమాద్రియందు, అనంతసౌందర్య సామ్రాజ్యమున శోభిలి జ్ఞానభిక్షువునైన నాకు దివ్య హేమమునుప్రసాదించి నన్ను ధన్యునిగావించినవి. పరమార్థమును దయసేయుమని అప్పటికిగాని నాయాంతరంగిక క్షుద్బాధ యుపశమింపదని నొసలున కేల్మోగిచి జగదీశు ననవరతము ప్రార్థించుచున్నాను.

ఇప్పటి మజిలీలోని బంగారుగుడి ఆత్మప్రతిబింబమును నాహృదయఫలకమున చిరాంకిత మొనరించినది. ప్రశాంతసమయములందు కనులుమూసికొని, ఒకపరి గుండె లోనికి చూడ్కినిగిడించి, అందలి స్వర్ణసృష్టినిగాంచి అచ్చెరువొందుచు నానందించు చుందును, చెవియొగ్గి అందుండివెడలు మధురమంజుల గీతారవమునువిని, ఎనలేని హాయి నందుచుందును. నామనసునందలి యమృతసరము నాకమృతసృష్టిశక్తిని ప్రసాదించెనేని, నాజీవనము సార్థకమైనదని తలంచెదను. జగదీశుకు మానవునకొసగిన సర్వోత్కృష్టమైన దానమీ శక్తిదానమేకదా! ప్రాణదానముచేసి దేవుడు మానవునవనిపై వుత్తెంచినాడు కాడు. 'నావలె సృష్టికర్తవుకమ్ము బిడ్డా!' అని మనుజునుద్దేశించిపలికి, తనశక్తిలో గొంత వానికొసగినాడు. ఈయంశమును గుర్తించినవాడే తృప్తికరముగ తనధర్మమును నిర్వహించుకొని, జనకుడైన జగదీశునిమ్రోల తగుసమాధానము నొసగగలడు.

రాత్రి మూడుగంటలు దాటినట్లూహించితిని. యోచనపై యోచన నామానస నిశ్రేణిపై నధిరోహించుచుండెను. మధురవాతావరణమందలి శాంతి సముద్రమును, పండువెన్నెలయందువ్వెత్తుగబొంగు అమృతసింధువును, ఉత్తాలతరంగములతో నాహృదయమున నుప్పొంగు ఆనంద మహోదధితో సహకరించి నన్ను బరవశు గావించినవి.

"బాబూజీ కహాఁహై?" ("బాబుగా రెందున్నారు?") అను కేక వినబడినది. అది దాదాజీ కంఠస్వరము. రాత్రి ఎన్నిగంటలకు పరుండినను, వేకువను మూడు దాటినంతన మేల్కాంచుట వాని యలవాటని నేనెఱుగుదును. అదే సమయమున పెక్కు నచ్చెలుల గూడి కలకత్తాలో చాంద్‌పాల్ ఘట్టమునకు స్నానమునకరిగి, భజనసలుపుచు నాతడు జగన్నాథఘట్టమువఱకు పోవుచుండువాడు.*

దాదాజీ లేచికూర్చుండులోపలనే నాతనికడ కరిగితిని. సూరజ్ సింగు బుడం కాయ లొకరితరువాత నొకరు నిద్దురనుండి మేల్కొనిరి. కూర్చుని, అనుకూలముగా తాళమువేయుచు వారేకగ్రీవముగా భజనగీతములను పాడదొడగిరి. ఇట్టిమిత్రులతో పల్లెలందును, పవిత్రప్రదేశములందును గడపుజీవిత మెట్టిదైయుండునో యూహింపుడు. అందలి హాయిని గ్రోలుటకు స్వర్గము దివినుండి భువికి పరుగులిడుచు రాదా?

* ఈ భజనమును గుఱించిన విచిత్రోదంతమును పాఠకులకు పదపడి యెఱిగింతును.

అమృతసరమున మజోకతావున వెండిగుడి కలదు. అత్తటి నామనసు దానిదెస బరతెంచినది. పండువెన్నెలలో పలుమాఱు తాజ్‌మహాలును పరికించి పరవశుడనైతిని. పండువెన్నెలలో వెండిగుడి నవలోకించి పరితోషమంద నేనపుడు కాంక్షించితిని. అది వెండివానలో తానమాడు వెల్లదేవునివలె నుండునేమో యనుకొంటిని. అది శుభ్ర కాసారమున నుండు టెఱుగుదును. అవిరళచంద్రికాపూరితమై ఆమధుమయ ముహూర్తమున నది రజతసలిల సంభరితమై యుండునని తలపోసితిని.

మనసులోని మక్కువ నందు బంధింపజాలనైతిని. నావాంఛయెట్టిదో వెంటనే దాదాజీకి దెలిపితిని. నాయెడల నాతనికెంతో ప్రేమకలదు. ఈతని చరిత్రయెట్టిదో చదువరులీవఱలో గ్రహించియుందురు. వృద్ధుడయ్యు, నుత్సాహమున నతడే యువకునకు దీసిపోడు. అతడనవరతము నవ్వుచునే మాట్లాడుచుండును. హాస్యవచనములతో సంగడికాండ్రను నవ్వించుచుండును. ఆమాటలందాదరానురాగములు వెల్లివిరియుచుండును. దాదాజీ మంచిభక్తుడు. ఒరులకై ఒళ్లుకోసియీయగల మహాత్ముడు. నాకోరిక నెఱిగినంతన నాతడు "అచ్ఛా! చలియే!" ("మంచిది; నడువుడు") అని చివాలునలేచి నిలిచినాడు. "ఉఠోసబ్" ("అందఱును లెండు") అనినాడు. రగ్గులుకప్పుకొని అందఱము లేచినిలిచితిమి. పిచికిగాడు నాదాపల జేరినాడు. దాదాజీ దారిదీసి, మమ్ములను వెండిగుడిదెస గొనిపోయినాడు.

| | | | | |
|---|---|---|---|---|
| స్వ | — | — | ము | 1. ప్రతియాంధ్రుడును పొందట కోరదగినది. |
| — | హ | — | — | 2. ఇది యిల్లాండ్ర శీలమునకు మెఱుగులు దిద్దును. |
| — | త్న | ము | | 3. అరుదు; కాని అమూల్యమైనది. |
| — | — | సు | | 4. ప్రపంచయుద్ధమునకు కారణమగునేమో అని యందఱు భయపడుచున్న దేశము. |
| — | — | | | 5. భారతదేశమునకు మకుటమువంటి పార్శ్వభాగము. |
| తి | — | న | | 6. ఆంధ్రులకు రసోచితమహాకావ్య ప్రసాదమును గావించిన మహాకవి. |

పేరు...................................

చిరునామా...................................

...................................

గృ. ల. 6.

పైకనుబరచిన ఆరుపదములను వానికెదురుగ నిచ్చియున్న యర్థముల సరిపోవునటుల పూర్తిచేసి నవంబరు 15 వ తేదిలోపల మా కార్యాలయమునకు బంపవలెను. ఒక్కొక్క గీత గలచోట నొక అక్షరము మాత్రమే పూర్తిచేయవలయును. అక్షరములు బిందుయుతములై యుండవచ్చును. ఒకరొకరొకన్ని జవాబులు పంపవచ్చును. కాని ప్రతిజవాబును గృహలక్ష్మి కూపనునందే యుండవలెను. స్త్రీలుమాత్ర మిందు పాల్గొనదగును. మావద్ద నుండుదానికి సరిపోవునట్లు జవాబును పంపినవారికి ఒక సం॥రము గృహలక్ష్మి పత్రిక ఉచితముగ పంపబడును.

# దేశోద్ధారకుల సన్మానము

గతసంచికయందు దేశోద్ధారకుల సన్మానమునుగూర్చి మేము వ్రాసినదానిని గని శ్రీయుత అన్నపిండి దేవీప్రసాద నారాయణరావుగారు వ్రాసిన యుత్తరము క్రింద ప్రకటించుచున్నాము. వారు గావించిన సూచనను బెజవాడ దేశోద్ధారక సంఘమువారు గమనింతురని యాశించుచున్నాము. సంపాదకుడు.

గృహలక్ష్మి పత్రికాధిపతులకు

మహాశయా!

వందనములు. తమ దసరాసంచికను చూచితిని. అది వివిధములైన పద్యగద్య వ్యాసములచేతను, పెక్కు చిత్రములచేతను, చక్కని ముద్రణచేతను మాత్రమేగాక అందలి విశాలభావములచేత నతిరమ్యముగానున్నదని వ్రాయుటకు మిగుల సంతసించుచున్నాను. ఈ సంచిక సంపాదకీయములందు తాము దేశోద్ధారకుల సన్మానమునుగూర్చి వ్రాయుచు నాయందుతమకుగల సదభిప్రాయమును వెల్లడించినందులకు మిగులకృతజ్ఞుడను.

దేశోద్ధారకుల సన్మానములనుగూర్చి పెక్కుపత్రికలు వ్రాయుచున్నవిగాని, ఆ సన్మానకార్యములందు — విగ్రహనిర్మాణమునందు — ఈవిధముగ వ్రాసినట్లు గనపడదు.

తాము వ్రాసినట్లు ఆంధ్రులందు సిల్పులుగలరు. దేశోద్ధారకుల విగ్రహమును, వారెవరైన చేయబూనుకొన్నచో నాకుకూడ సంతసమే. లేక బెజవాడ దేశోద్ధారక సంఘమువారు అంగీకరించి పరికరములను సమకూర్చి కావలసినయేర్పాటులను గావించినచో నేనే విగ్రహనిర్మాణమునకుబూని, చెన్నపురియందైనను, బెజవాడనందైనను పని ప్రారంభింపగలను. ఈవిధముగ విగ్రహనిర్మాణమున వారికి కొంతవ్యయము తగ్గుటయు, తమ యాశయము నెరవేరుటయు జరుగగలదు.

దీనిని తమ పత్రికయందు ప్రకటించుకొనగలరు.

చిత్తగించవలెను

18-10-37

ఇట్లు

రాజమహేంద్రవరము.

(Sd) అన్నపిండి దేవీప్రసాద నారాయణరావు.

# పాక కళ

## కూరగాయల పలావు

వలయుపదార్థములు: పట్టికొలచిన 2 టీకప్పులబియ్యము, 3 టీకప్పుల పలావుబియ్యము, 2 టేబిల్ స్పూనుల ధనియాలు, 1 అంగుళము పొడుగుగల పసపు, 10 ఏలకాయలు, 4 పెద్ద ఉల్లిపాయలు, 1 టర్నిప్, 1 కారట్, 1 నాల్ ఖాల్ (Knol-Khol), టీస్పూనంత ఉప్పు.

చేయుపద్ధతి: తేటనీరు వచ్చుదాకా బియ్యమును పెక్కుసార్లు కడిగి వడబోసి, దానిని ఒక గుడ్డమీద ఆరబోయుము. టర్నిప్, కారట్, నాల్ ఖాల్ వీని తొక్కచీవి, చిన్నచిన్న చదరపుముక్కలుగా తరిగి, 6 టీకప్పులంత నీళ్లుండు ఒక చిన్న పాత్రలో వేయుము. ఆ పాత్రమును కప్పి బాగుగా మండుచున్న నిప్పుపై దానినుంచుము. ఆ కూరగాయలు బాగుగా ఉడుకుచున్నపుడు ఉప్పుచేర్చుము. అప్పుడు దానిని వడబోసి వేరుగాపెట్టుము.

ధనియాలను పసపును దంచి పొడరు మాదిరి చేయుము. ఉల్లిపాయలను ముక్కలుగాతరిగి,అందులో సగముతీసికొని ధనియాలు పసపుపొడరుతో దానిలో కొంచెము నెయ్యిపోసి, ఒక బాణలిలో వేగించుము. ఉల్లిపాయలు బ్రౌన్ వర్ణముగా మారునప్పుడు ఆరినబియ్యమును చేర్చి 2, 3 నిమిషాలు నిప్పుమీద కలబెట్టుము.

ఈ మిక్చర్‌ను ఒకపాత్రలోనికి పోసికొని, టర్నిప్ వగైరాలు వడకట్టిననీళ్లుపోసి, మూతపెట్టి, 4, 5 నిముసములకాలము వండుము. అన్నమయినతర్వాత ఉడికిన టర్నిప్పులు వగైరాలనుచేర్చుము.

ఇప్పుడు మిగిలిన ఉల్లిపాయలను, మిగిలిన నేతిలో వేగించి, దానికి బ్రౌన్ వర్ణము వచ్చునప్పుడు ఏలకులు వేయుము. దీనిని బియ్యము, టర్నిప్పుల మిక్చరుకు చేర్చి 15 నిమిషములు వేచుము. బంగాళాదుంప కూరతో వేడిగా వడ్డించుము.

## బంగాళాదుంపల కూర

వలయుపదార్థములు: 15 సాదాసైజు బంగాళాదుంపలు, కొబ్బరికాయ, 1టీస్పూను 'కస్-కస్, 2 టేబిల్ టీస్పూనుల ధనియాలు, 5 ఎండుమిరపకాయలు, 1½ టేబిల్ స్పూను జీలకఱ్ఱ, 1 వెల్లుల్లిపాయ, 3 ఉల్లిపాయలు, అల్లము, కొద్దిగ పసపు, పట్టికొలచిన టీస్పూనంత ఉప్పు.

చేయువిధానము: బంగాళాదుంపలు బాగుగా నుడికించి పొట్టుదీసి కావలసినట్లు ఒక్కొక్కదానిని నాలుగైదు ముక్కలుగ కోయుము. వెల్లుల్లి, ఉల్లిపాయల పొట్టువొలిచి, ఒకఉల్లిపాయను బాగుగా తరుగుము. అట్లే కొబ్బరికాయను తరిగి దానిలో నీరుకలిపి ఒకగుడ్డలోపోసి వడగట్టునట్లు పిండుము. ఈ పాలు చిక్కగా 1½ టీకప్పు లుండవలెను.

వెల్లుల్లి, మిగిలిన రెండుల్లిపాయలు, గసగసాలు, ధనియాలు, జీలకఱ్ర, అల్లము, పసపు, మిరపకాయలు వీనినన్నిటిని ఒక చక్కనిముద్దగా నూరుము. 3 టేబిల్ స్పూనుల నేతిలో తరిగిన ఉల్లిపాయలను బ్రౌను రంగువచ్చునట్లు వేచి అందు ఆముద్దనుకలిపి 10 నిముసములు వేయించుము. ముక్కలుగాతరిగిన బంగాళాదుంప (ఉరలగడ్డ) నందువేసి బాగుగా కలుపుచు, ఉప్పు, కొబ్బరిపాలు చేర్చుము. 15 నిమిషములు బాగుగా కలుపుచుండవలెను. వేడివేడిగా వడ్డించుము.

## టొమెటో సూప్

వలయుపదార్థములు: 12 బాగుగా పండిన టొమేటోలు, 25 మిరియాలు, 5 పుదినా ముక్కలు, 1 టీస్పూను ఉప్పు,1 లెవెల్ టేబిల్ స్పూను బియ్యపుపిండి, 1 పెద్దఉల్లిపాయ, 2 టేబిల్ స్పూను నెయ్యి.

చేయుపద్ధతి: టొమేటోలనుకడిగి ముక్కలుగా కోసి ఒకపాత్రలోనుంచుము. 6 టీకప్పుల చన్నీళ్లు అందులోపోసి, మిరియాలను పుదినాను అందువేయుము. ఒకగంటన్నర కాలము బాగుగా ఉడుకనిమ్ము. పలుచని గుడ్డలో వడబోసి ఉప్పువేయుము.

ఉల్లిపాయ పొట్టొలిచి, ముక్కలుగాతరిగి, నేతిలో దానినివేయించి బ్రౌను రంగువచ్చిన తర్వాత 'సూప్' తో కలుపుము. బియ్యపుపిండిని నీటితోకలిపి ఒక పల్చనిముద్దచేయుము. ఆసూప్పును పొయ్యమీదపెట్టి, ముద్దను మెల్లగాచేర్చుచు 10 నిమిషాలు కలబెట్టుచుండుము. తరువాత వడబోసి వేడిగావడ్డించుము.

ఎం. శాంతాదేవి.

# అల్లిక పనులు

ఎన్. వీ. నరసింహాయ్యగారు




FIG. 1




FIG. 2 SPOKE STITCH FIG. 3




FIG. 4




FASTENING OFF OLD AND JOINING ON NEW THREAD FIG. 5







SPLIT GROUP STITCH




FIG. 8 THE SAMPLER

ముందు కనబరచిన అభ్యాసము నందువలె మొదట దారములను చేర్చి కుట్టవలెను. ఆ తరువాత చేయవలసిన కుట్లు ఇచట వ్రాయబడు చున్నది. ఆకుట్లు దారము ప్రక్కకు త్రోయ బడిన చోటనే ప్రారంభింప బడవలయును.

అంచుకుట్టు.

ప్రారంభింప వలసిన విధము మొదటి మూడు పటములందును చూప బడియున్నది. ఈ రెండవ మారు ప్రారంభించు కుట్టునకు స్పోక్ కుట్టు అందురు. దీనిని ముందు ఎత్తి కట్టిన దారముల కూర్పులమీద రెండు ప్రక్కలను కుట్టుచు వచ్చిన చాల నందము నిచ్చును.

ఇదివఱకే దారముల దీసి కట్టియున్న భాగమునకు లోప్రక్కన అర అంగుళము క్రిందనుండి సూదినిదూర్చి అంచువద్ద

ఒక దారమునువీడి గూడిని పైకితీసికొని రావలయును. (పటము 1.) తరువాత (పటము 2.) ఇంతకుముందే కుట్టు ప్రారంభించియున్నచోటికి సూదినిదీసి, ఇది వఱకు అంచుప్రక్కన వేసియుండు మూడునాలుగు దారములనుచేర్చి కుట్లను కేయవలయును. ఈకుట్లు దారములను వేరుగా చేర్చియుంచును.

క్రొత్తదారమును చేర్చుట. కుట్టుచున్నదారము ముగిసి క్రొత్తదారమును చేర్చవలసివచ్చినపుడీ క్రింది విధముగ (4,5 పటములు) చేయవలెను.

దారము పూర్తిగా ముగియువఱకు కుట్టక కొంచ ముండగనే నిలిపివేయవలెను. దానికి సమీపముననే నూతనదారము—కుట్టు ప్రారంభించినప్పటివలె—కుట్టి (4 పటము) దారపుకొన ముడివేయవలెను. తరువాత దానిమూలమున నిలిపిన చోటనుండి కుట్లను ప్రారంభింపవచ్చును. కుట్లన్నియు ముగిసినపిదప, కుడిపైపుకుట్లను ప్రక్కనగల పొడవుగనున్న కుట్లను కత్తిరించి కొనలను లాగివేయవలెను (పటము 5.)

## విభాగించు కుట్టు (Split group Stitch)

ఇది 6, 7, 8-వ పటములందు చూపబడియున్నది. ఇదివఱకు పైచెప్పినరీతి, కుట్టవలసిన గుడ్డకు వలు ప్రక్కల అంచులందు కావలసిన వెడల్పులో దారములదీసి తరువాత అంచులను, మిగిలియున్న నిలువు దారములను చేర్పరచి కుట్టవలెను. ఆ తరువాతగాని యీకుట్టు మొదలుపెట్టుటకు వీలుండదు.

ఈకుట్లు 1, 2 పటములందు చెప్పినరీతిగనే కుట్టవలసియున్నను, దారములు మాత్రము రెండు రెండుగా విభాగించి కుట్టవలయును. మొదట రెండుదారముల వేరుపరచి ముందుచెప్పినరీతిగా కుట్టవలయును. పిదప మిగిలిన రెండుదారములను ప్రక్కనగల యింకొక గుంపులోని రెండుదారములతోచేర్చి యొక కుట్టు వేయవలెను. ఈకుట్లు ఏయేచోటులందు కుట్టిన బాగుండునో, 8-వ పటమున చూపబడినది.

## రిబ్బనుకుట్టు: వానిని కుట్టువిధములు

దీనిని కుట్టుపనియనిచెప్పక రిబ్బనుపనియని వచించుటకు కారణమేమన, కుట్టుపనియందుండునట్లు ఈ రిబ్బనుకుట్టులందు కుట్టుమాత్రమే గాక ఒక్కొక్కదానికి తగిన పద్ధతులు, నిర్మాణము లుండును. రిబ్బను పనులందు జూపబడిన రీతి, బొమ్మలకు తగినట్లు, నిజమగు పుష్పములవలె వానిరూపమునందె యిమిడ్చి, వానికి చేరియుండురీతి చేయవచ్చును. కొన్నిటికి రిబ్బనుబొమ్మల పైభాగమునుండి సూదిచే క్రింద కణుగునట్లు కుట్టుటవలన దిద్దితీర్చినట్లుండును. రిబ్బను అణుగునట్లు కుట్టుట కుపయోగించు పట్టు దారపు రంగును రిబ్బనురంగును ఒకటైయుండుట ఆవశ్యకము. "పాంబడార్ రిబ్బ"ను ఎంబ్రాయిడరీ దారమువలె బొమ్మలలోదూర్చి లాగబడుచున్నది. "జెయింట్బ్రేక్" రిబ్బనుగూడ బొమ్మలకు హెచ్చు తగ్గులుగా పలుమరు అమర్చబడుచున్నది. పికొట్టి రిబ్బను పైవానివలె బొమ్మలలో దూర్చబడక పైనకే యుంచి కుట్టబడియుండుపద్ధతులు క్రింద కనబరచబడినవి. వివరముగ వ్రాయబడిన పటములు మీకా విషయములను జూపగలవు. వీనికిసంబంధించిన సులభమైనపద్ధతులు, సులభముగ తెలియుటకై చిత్రపటములమూలమున కుట్లతోగూడ చూపింపబడియున్నవి.



మొదటిపటము: అందమైన రోజాకేసులయందు "పాంబడార్ రిబ్బను"ను ఎంబ్రాయిడరీ దారమురీతి వ్రాసినపటమందు కుట్టబడు రీతియును, దానివలన

పుష్పములకు సహజసౌందర్యము గలుగునట్లు చేయబడిన రిబ్బనుకుట్లును, వివరముగా జూపుచున్నది.

రెండవపటము: ఈ యందమైన చిన్న పువ్వును కుట్టునపుడు "పాంబడార్ రిబ్బను" ఆ బొమ్మపై యుంచి కుట్టబడినది. కుట్టు ప్రారంభించుటకు ముందు తగినంత రిబ్బనుదీసుకొని దానిని సూదిలోజేర్చి,



రిబ్బనుకొనయం దొక ముడినివేసి, సూదియొక్క అడుగుభాగమునుండి రేకు మధ్యభాగమునకుదూర్చి, రిబ్బను ముడివచ్చువరకు మెల్లగాలాగి, పిదప సూదిని రిబ్బనునుండి తీసివేయవలయును. తరువాత రిబ్బనును ఒకరేకు పైభాగమునకుదూసి, ఆ రేకు అంచువరకు పరచి యణచి, పట్టుదారముతో సూదితో అచటొక 'టాకా' వేయవలయును. ఈవిధముగ కుట్టునంతయు ముగించవలయును. టాకాలు వేయుటకు ముందు రిబ్బను (బొమ్మయందలి) రేకులను పూర్తిగా కప్పియున్నదా లేదా, అది బిగువుగా లేక పుష్పముయొక్క ఆకారమును సౌందర్యము ననుసరించియున్నదా యని ముఖ్యముగా గమనించవలయును.

మూడవపటము: డెయిసీయను పూ రేకులను "జెయింట్ క్రేప్" రిబ్బనుతో నెట్లు కుట్టవలయునో చూపుచున్నది. ఇందులో సూదియొక్క పెద్దరంధ్రమున ఎంబ్రాయిడరీ దారముకీతి రిబ్బనును చిన్నదిగనే దూర్చబడియున్నది. ఏలన మాటిమాటికి క్రిందికి పైకి కుట్టుటవలన శ్రమ గలుగును. అవసరపడక నిదానముగా కుట్టుటవలన యీ పువ్వుయొక్క విశాల



రూపము పూర్తిగ రేర్పడును. ఈపూరేకులు వెడల్పుగా లేనందున రిబ్బనుకొన ముడివేసి సూదియందు దూర్చి రేకుయొక్క పైభాగమున క్రిందిభాగమునుండి కుట్టి, రిబ్బను రేకుపైన విశాలముగపరచి వదులుగా యుంచి, సూదిని పూవుమధ్యములో కుట్టి లాగవలయును. దీనివలన నొకరేకు ముగియును. దానివెనుకనే సూదిని అడుగుభాగమున సమీపమందుగల రేకుయొక్క మొనయందునుచ్చి పైకి గొనివచ్చి పైచెప్పినరీతి ముగించవలయును. అట్లే అన్ని రేకులను కుట్టవలయును.



నాల్గవపటము: ఆప్పిల్ బ్లాసమ్ (Apple Blossom) అను పూవుపై గనబరచిన మూడవపటమునందుండిన ప్రకారము కుట్టవలయును. రేకు పెద్దదైనయెడల కుట్టు ముగించినపిదప సూది మొనతో రిబ్బనును రేకంతయు విస్తరింపజేయవలయును.

# ప్రతివిమర్శ

శ్రీమతి లక్ష్మీదేవిగారు, "విశారద."

[ఈవిషయ మింతటితో విరమించడమైనది. దీనినిగూర్చి విమర్శన లింక ప్రచురింపబడవు. సంపాదకుడు.]

గృహలక్ష్మి దసరాసంచికయందు శ్రీమతి సుశీల గారు "నూతనరాజ్యాంగవిధానము" పై వ్రాసిన విమర్శన గాంచితిని. వారివిమర్శనకిది జవాబనందగు. ఈపొత్తము పేరు "నూతనరాజ్యాంగవిధానము" గాని "రాజ్యాంగ విధానచరిత్ర" కాదని గ్రహించియుండిన యెడల శ్రీమతి సుశీల గారి విమర్శయందలి ప్రథమాంశమునకు తావుండెడిది కాదేమో. నూతనరాజ్యాంగ విధానమునకు గల "Background"ను చూపుటయే గాని దానిని విమర్శించుటకు దొడంగుట గ్రంథకర్త గారి యాశయమైయుండదు. అందులకే దానికి వారు "సింహావలోకనము"ని నామకరణ మిడియుండవచ్చు. ఆవిధముగా 1773 రెగ్యులేటింగు ఆక్టు ప్రారంభముగా జరిగిన ప్రతిచట్టముయొక్కయు సంబంధబాంధవ్యములు విమర్శించుటకే వారు దొడంగినచో నీపొత్తము 300 పుటలకు మించుటయేకాక యిట్టి రాజకీయగ్రంథముల పఠింప నుద్యమించువారల భయోత్పాతమునకు గారణ మగును.

"సార్వభౌముడు అను అధ్యాయమున చూచిన సార్వభౌమునకు అధికారముకలదేమో యనుసంశయములు వొడముట కవకాశములున్నవి." అట్టి అధికారములు "మాటలయందు మాత్రమేగలవనియు అనుభవమున లేవనియు" నెల్లరకు విశదమైయుండగా దీనిపై నింతచర్చయేల? అటుల సార్వభౌమునకు అధికారములు లేవని వచియించుటకు బ్రిటిషు రాజ్యాంగ విధానమునుగూడ ప్రవేశింపవలెనని నాయూహ. సార్వభౌమునకును, స్వదేశసంస్థానాధీశ్వరులకు గల సంబంధమునుచర్చింపుచు, వీరు వారినిగూర్చి వేరుగా వ్రాసియుండకపోవుటచే, Morgan నివేదికనందు పొందుపరచి సంస్థానాధీశ్వరుల కష్టనష్టములజూపిన రామాయణమునందు పిడకలవేట కానేరదు.

అఖిలభారత ఫెడరేషనును కని విని యెరుగని పోకడగలదిగాన చెడుపోకడగలదని వారు వ్రాసియుండలేదు. దీనియందు నింకను ననేకలోపములు కలవనియు అందుచే నది చెడుపోకడ గలదని 110, 111 పుటలలో వ్రాసియుండిరి.

ఆంధ్రభాషయం దింకను సాంకేతికపద నిర్ణయము గాక తడబడుచున్న కాలమున వీరు గ్రంథకర్తగారి నట్టివిషయముపై విమర్శింపగడంగుట యసమంజసము. Federationఅనుమాటకర్థము "సంయుక్తరాష్ట్రము"ని సుశీలమ్మగారి వాదన. "సంయుక్తరాష్ట్రము" దీని కర్థము. కొన్ని రాజకీయభాగములుగలసిన రాజ్యమని యర్థమిచ్చును గాని ఆరాజ్యమునుపాలించు సంఘము కానేరదు కాన రాష్ట్రీయసంఘమనుటయే సమంజసముగానున్నది. 'రాష్ట్రీయస్వపరిపాలనము' కానేరదు.

Legislature అని యింగ్లీషున నుపయోగించునపుడు చట్టనిర్మాణసభ, మంత్రివర్గము, పరిపాలనాధికారి ముగ్గురును గలియుటాని కర్థమిచ్చును. కావున శాసననిర్మాణవర్గ మనుటయే తగును. శ్రీమతి సుశీలగారు నూతనరాజ్యాంగవిధానమునుగూర్చి గ్రంథకర్తగారు చదివిన గ్రంథములు తప్పయిన యుండవలె లేదా తప్పు Proof దిద్దువారిదైన గావలెననిరి. దీనిగూర్చి గ్రంథకర్తగారితో ప్రస్తావించగా 1935 ఆక్టులో Public Service Commission అనియే యుండునని చెప్పిరి. "సింధురాష్ట్రమునందలి గవర్నరు కూడా" ఇదియొక అంశము. C. P. గవర్నరుగారికి Berar పైగల ప్రత్యేకబాధ్యతను గూర్చి జెప్పుచు

సింధురాష్ట్రి గవర్నరుగారికికూడా అట్టి ప్రత్యేక బాధ్యత గలదనియు నది Sukkur Barrage పైగల దనియు వ్రాసిరి. ఇందుగల తప్పేమి?

ఇక "శోచనీయము"నుమాటపై చర్చ. సారాంశమే లేని యీనూతన రాజ్యాంగచట్టమున నీమాత్రము సారముండుట శోచనీయమని గ్రంథకర్తగారి యుద్దేశ్యమై యుండవచ్చును. క్లిష్టాన్వయము ఉన్నంత మాత్రమున యేపాత్రమునుగాని యిష్టమువచ్చినట్లు విమర్శింప న్యాయమా? సులభశైలిని పొడిగించి "వీరు సీమపార్లమెంటులో..............బడియుండవచ్చు" నని వ్రాసిన దోసమా? కటువుగా వ్రాసిన తప్పు. సులభముగా వ్రాసిన నింకొకతప్పు. ఎగదీసిన బ్రహ్మహత్య, దిగదీసిన గోహత్య.

ఈవిమర్శనగాంచిన "Forced Criticism" వలె గన్పట్టుచున్నది కాని పాత్రముచదివినపై పొడమిన యూహాలవలె గనపడుటలేదు. ఇట్టి విమర్శనలకు గడంగుట ఆంధ్రభాషాయోషామతల్లికి శ్రేయోదాయము కాదనుటలో సందియము లేదు. *

## 1.శుభమస్తు, 2.వసంతము, 3. రసాంజలి.

(అద్దేపల్లి లక్ష్మణస్వామి నాయుడుగారిచే రాజమండ్రి సరస్వతీ పవర్ ప్రెస్సునందు ముద్రితము.)

ఈ మూడుగ్రంథములును చిన్నపొత్తములు, శ్రీ అద్దేపల్లి నాగగోపాలరాయకవి సుహృన్మణికి పరిణయోత్సవావసరమున ప్రేమాంకితములు. 'శుభమస్తు' అన్నది శ్రీ గోపాలరాయ కవిగారిమిత్రులు సమర్పించినది. ఇందు శ్రీ పెనుమత్స సత్యనారాయణరాజు, అయితం కాళీవరప్రసాదరావు, వంగూరి రామారావు, అద్దేపల్లి కుటుంబరావు, సహదేవ సూర్యప్రకాశరావు, బొడ్డు బాపిరాజు, కృత్తివెంటి సుబ్బారావు, ఉమర్ ఆలిషా, విట్టల వెంకటేశ్వర్లు, పెమ్మరాజు లక్ష్మీపతి, వేదుల సత్యనారాయణశర్మ, గండికోట సూర్యప్రకాశరావు, హరిపురుషోత్తమశర్మ, కాశిరాజు రామమోహనశర్మ, కొండేపూడి సుబ్బారావు, అమ్మిశెట్టి లక్ష్మణస్వామి, నరహరిశెట్టి శేషగిరిరావుగార్లు వధూవరుల నాశీర్వదించియున్నారు. వీరలలో అనేకులు ఈవఱకే యాంధ్రలోకమునకు చిరపరిచితులు. వారినిగురించి మరల నిట నుగడింప బనిలేదు. అయినను మచ్చునకు ఒకటి రెండు. "కులుకులతో, నునులేనగు మొలకలతో, కొసరికొసరు ముద్దులపసలో, బిలిబిలిపలుకులతో మీరలరుడు కలకాలమవని నాల్మగలారా" (పు. 12) "మాతృప్రణయంపు టింద్రధనుస్సునకును నారి నొడగూర్చియందిచ్చినారు నీకు, తెలుగునుమకైత యలుగుసంధించి నిలిచి యేవలపురాజ్యములు గెల్వ పెక్కువెడుదో?" (పు. 20)

'వసంతము' శ్రీ పెమ్మరాజు లక్ష్మీపతిగారి ప్రత్యేకగ్రంథము. ఇందలిపద్యములు చాల హృద్యములుగ నున్నవి. "ఈసరి క్రొత్తకెంజిగురు లేతొవి పూవుల కమ్మతావులీ యాసవమాధురీమహిమలీ సకలంబు ననుగ్రహించి కైసేసిన యీవసంతనవజీవన

* విమర్శకులకు తప్పనితోచినవి యొత్తిచూపుట వారివిధి. అది గ్రంథకర్తలమీద కక్షతో జేసినది కాదు. రాజకీయవిషయాలనుగురించిన పుస్తకము లెక్కువగా అవసరమున్నరోజులివి. కావుననే తప్పులను దెలిపినచో పునర్ముద్రణమునన్నైన నవి సవరింపబడునను నభిప్రాయముతో విమర్శ చేయబడినది.

సాంకేతికపదనిర్ణయము పూర్తిగా జరుగలేదు కనుకనే అందరును ఒకేపదమును వాడవలసిన అవసరము చాలాగలదు. 'ఫెడరేషన్' అనగా "కొన్ని రాజకీయభాగములు కలసినరాజ్యము" అనియే యర్థముగాని రాజ్యమును పాలించు సంఘము కాదు.

ఇండియాఆక్టు (1935)లో సెక్షను 12d, 52c లలో "Public Services" యొక్క హక్కులను గురించియే యున్నది. 'Members of the Public Services Commission' అని యెక్కడనున్నదో తెలియరాదు. గ్రంథకర్తగారు మరొకసారి చూచిన బాగేమో?

—సుశీల.

వైభవముల గ్రహించి యాయాసము విస్మరింప జనదా క్షణకాలము మానవాళికిఁ ?" (పు. 11) రసాంజలి శ్రీ గోపాలకిష్కృశేషి గారవతాత్పర్యములతో వారికి సమర్పించినది. "మీ పెండ్లివేళ కవితా శ్రీ పుష్పమనోజ్ఞమాల శిష్యజనులు భక్తిప్రీతులతో నొసగెదరీ పూజలను గ్రహింపవే కవిచంద్రా" యని ప్రార్థించుచు, నతి, రహస్యథ, సారంగుని పెట్టు, నివేదన, ప్రియా, అను శీర్షికలపై వ్రాసినారు. శ్రీహరి ఆదిశేషు గారి కవిత అంతగా రంజించలేదు. మిగతవి చక్కగా నున్నవి. ఈమాటలోను శ్రీ అంకాల సుబ్బారావు పూర్ణభావయుతములయిన చిత్రముల నెంతో నేర్పుతో చిత్రించియున్నారు.

## తూర్పు కృష్ణాజిల్లా జాతీయోద్యమ చరిత్ర.

(సంపాదకుడు మానికొండ సత్యనారాయణ శాస్త్రి గారు, శ్రీ వల్లభనేని రామబ్రహ్మముగారిచే ప్రకటితము. మచిలీపట్టణము కృష్ణాస్వదేశీ ముద్రాక్షరశాలయందు ముద్రితము, వెల 0-8-0) ఇందు జాతీయోద్యమచరిత్రను వాల్గభ్యాయములుగ విభజించి పరిణామమును సూచించినారు. కాంగ్రెసు ఉద్యమములకు కృష్ణా (తూర్పు) జిల్లా యొక్కట్లు గ్రామవారీగా తోడ్పడెనో యెంద ఱెట్టి కారాగారవాసశిక్షల ననుభవించిరో విస్తారముగా వివరముగా చిత్రములతో సహా విలిఖింపబడినది. చదువువారికి జాతీయోద్యము నెడ నుత్సాహము కలిగి యథోచితముగా తత్ సంస్థకు తోడ్పడవలెనను ఉద్దేశము కలుగుననుట నిక్కవము.

## గురుకట్నము. (కర్త: శ్రీ పెండ్యాల సీతారామయ్యగారు పూళ్ల, పశ్చిమగోదావరి. వెల 0-8-0)

ఇందు శ్రీ కృష్ణలీలలు వర్ణితము. బహుశః ఇది తనకట్నముగా గురువులు కుసుమహారనాథులకు గ్రంథకర్తగారు సమర్పించుటచే నిది గురుకట్నమయ్యె కాబోలు. ఇందు కులధర్మము రక్షించుట ముఖ్యమని యశోదమ్మ చేసిన వాక్యములు కడుంగడు హృద్యములుగా నున్నవి. చూడు డొకఘట్టమున "వచ్చెనా యేడ్పు తండ్రి! నేచచ్చిపోయినానురా! యేడ్వకింక మానాన్న నేను వచ్చిచెప్పెదలే! యయ్యవారితోడ, నేడ్పుమానర! యిట్టులీ యేడ్చుచున్న జాడలేనుర! నామన్కి మరిగిపోను". ఇవెంతసహజములో ? ఇట్టివెన్నేని చూపవచ్చును. అచటచట అచ్చుతప్పులున్నవి. రెండవముద్రణమున సవరించుకొందురని విశ్వసించుచున్నాము.

## ప్రకృతివైద్యము: గ్రంథకర్త డా. పుచ్చా వెంకట్రామయ్యగారు. డబుల్ క్రౌన్. (గృహలక్ష్మిసైజు) వెల 2-8-0.

సామాన్య జనముల కుపయోగించు నొక అమూల్య గ్రంథము సునాయాసముగా, సులభముగా నందఱును ఆరోగ్యభాగ్యము ననుభవించుటకు తగిన పద్ధతులను వివరముగ వ్రాయబడినవి. కృతికర్తగారు ప్రకృతవైద్యమున నత్యానుభవము గలవారగుట ప్రతివారును ప్రకృతివైద్య విద్యార్థులగుటకు వీలగునటుల వ్రాసియున్నారు. ఇందు శరీరశాస్త్రము, రోగనిదానము, రోగచిహ్నములు, ఆహారశాస్త్రమునుగూర్చి విపులముగ వివిధప్రకృతి చికిత్సలనుగూర్చి వ్రాసియున్నారు.

# పుష్పచయము

## ప్రసవమున ఆఱుబిడ్డలు ?

స్పెయిన్ దేశములోని కార్టజీనాపట్టణములో ఒకస్త్రీ మొదట ఇర్వుర శిశువులను కనెను. పది రోజులు తరువాత మరియిర్వుర శిశువుల కనెనుగాని వారు మరణించిరి. ఇదయిన అయిదురోజులకు మఱొక శిశువును, తరువాత మరల నొకశిశువును కనెను. ఈయిర్వురశిశువులుకూడ మరణించిరి. మొట్టమొదటపుట్టిన ఇద్దఱు బిడ్డలుమాత్రము సజీవులయియున్నారు. అందఱుశిశువులును ఆడుబిడ్డలు. వీరందఱు 15 దినములలోగా పుట్టిరి.

*　　*　　*

## 'అభినవ' హరిశ్చంద్రుడు.

పురాణములలోని హరిశ్చంద్ర చక్రవర్తినిగూర్చి మనము వినుచున్నాము. అతడు పాలించిన నిత్య సత్యవ్రతము లేకున్నను అతనివలె దారపుత్రులను అమ్మువారు నేటికిని లేకపోలేదు.

బెల్‌గ్రేడ్‌లో, తనభార్యను ఇద్దఱుబిడ్డలను పోషించుటకు నిక నేమాత్రము తనవల్ల కాదని తలపోసి కృపవత్సపట్టణసమీపమున నున్న జాగినెట్స్‌గ్రామములో కట్టెలమ్ముకొని బ్రదుకు స్టేపన్‌టార్టిచ్ అను నొకడు వారలను నడివీధిలో వేలము వేసి 4 షిల్లింగులు 2 పెన్నీలకు (3 రూపాయలకు) అమ్మినాడు. ధనికుడైన నొకకర్షకుడు తనయింటికి నౌకర్లుగా వారిని కొనెను.

*　　*　　*

## ఇది వినిమయమా ?

స్పెయిన్ దేశములో జరుగుచున్న యుద్ధమునుగూర్చి యెల్లరెరుగుదురుగదా! అచట జరుగు విశేషముల నన్నిటిని గమనించిన ఆశ్చర్యచకితులు కాగలరు.

ఓడియన్ డిబోన్ అను డెబ్బదినాలుగేండ్లముదుసలి రసాయనశాస్త్రవేత్త స్పెయిన్ దేశస్థుడు జనరల్ ఫ్రాంకోకు జిక్కుకొనెను. అతడు ఒకసంవత్సరము కారాగృహవాస మనుభవించినతర్వాత పల్మ జెయిల్‌నుండి మొన్న విడుదలచేసిరి.

జనరల్ ఫ్రాంకోను సమర్థించుచు యుద్ధమున నతనికితోడ్పడు నిర్వురస్త్రీల నొసగినతరువాతనే యీ శాస్త్రజ్ఞుడును అతనిభార్యయు విడుదల చేయబడిరి.

*　　*　　*

## ఇంకా ఘోషా ?

ఈ పత్రికలో ఘోషానుగూర్చి ఒండు రెండువ్యాసములు కానవగును. ఈపద్ధతి ఇతరత్రకూడగలదు. అక్కడి విశేషమేమన, ఒకసారి ఘోషా పూర్తిగావదలి వేసి దానిని పునః స్వీకరించుట. ఈక్రిందిసమాచారము ప్రపదపత్రికలో గలదు.

మధ్య ఆసియాలోనున్న తాజికిస్తాన్ రాజ్యమున (ఇది రష్యాకు జేరినది) వేలకొలది బాలికలు తిరుగా ఘోషాపద్ధతి నవలంబించినారు. తాము ఘోషా మాని బయటికరిగినయెడల, తమభర్తలు కమ్యూనిస్టులయి యుండియు, తమ్ము చావమొత్తెదరట.

రష్యలో కమ్యూనిస్టురాజ్య మేర్పడినతోడ్తోడనే ప్రథమముగా వారు సాగించినది ఘోషా మాన్పించుటయే.

* * * *

## పూనా భారతస్త్రీ విశ్వవిద్యాలయము:

బొంబాయిప్రధాని మొన్న శ్రీమతి వాఖీబాయి థాకర్సేగారితో ముచ్చటించుచు పూనాలో డాక్టరు ఖార్వేగారు స్థాపించిన భారతస్త్రీ విశ్వవిద్యాలయమునకు ప్రభుత్వ 'సమ్మతి' (Recogniti on) నొసగుటకు వాగ్దానముచేసిరి. ఈ రికగ్నిషన్ చేకూరుటతోడనే ఈ విశ్వవిద్యాలయమునకయి సర్ థాకర్సే గారు పెట్టిన మూలధనమగు 15 లక్షల రూప్యములు లభింపగలవు. ప్రస్తుత మా మూలధనమునుండి వడ్డి మాత్రమే లభించుచున్నది.

ఈ విశ్వవిద్యాలయమునందు ఎం.ఏ. డిగ్రీ పరీక్షదాక బోధనశాఖలు గలవు. అన్ని విషయములును మాతృభాషలో నేర్పబడుచున్నవి. ఆంగ్లము ప్రత్యేకభాషగా నేర్పెదరు.

ఆంధ్రదేశములో నట్టి పెట్టుబడి, పలుకుబడిగల స్త్రీవిద్యాలయము స్థాపించుటకు ఆంధ్రప్రముఖులును, విశ్వవిద్యాలయమువారును ప్రయత్నింపబూనుకొందురా?

* * * *

## పాశ్చాత్యానుకరణమా?

మన మాతృదేశ పురాతనౌన్నత్యమును తూలనాడువారు నేటికి లక్షోపలక్షలుగ నున్నారు. వీరికి నేటి నాగరికతయే గొప్పదని యభిప్రాయము. మీదుమిక్కిలి పాశ్చాత్యనాగరకత సర్వథా అనుకరణీయము; కాని ప్రపంచమునంతయుదర్శించి మంచిచెడుగులగ్రహించిన యొక మహానుభావుడు (మెహతాగారు) ఇండియన్ రివ్యూపత్రికలో నేమివ్రాయుచున్నాడు?

“జపాన్ స్త్రీలవలె భారతస్త్రీలును తమ సాంఘిక, నైతిక, ఆధ్యాత్మిక, జాతీయాదర్శములకు చాలామట్టుకు విధేయులయియున్నారు. పాశ్చాత్యవైవాహికవిధానము మనపద్ధతులకన్న మంచిదనువారు ఎక్కడనో అరుదుగ నున్నారు.

దేశకాలానుసరణముగా సంఘమునుద్ధరించుటకు స్త్రీల పూర్వాచారపరాయణత్వము అడ్డుదగులుననుట హాస్యాస్పదమే యగును. జీవితపర్యంతము మైనర్లవలె తమ్ము తమభర్తలు చూచుటనుమాన్పించుట, తమ పేరనే ఆస్తులను కల్గియుండుట మొదలగు హక్కులకయి కృషి సలుపుచున్నారు.

ఇటీవల లాహోరులోజరిగిన పాన్ ఆసియా స్త్రీసమావేశములో కొందఱు మాటలాడుచు పాశ్చాత్యాదర్శములజూచి భ్రమపడకుడనియు, భారతదేశసమష్టి కుటుంబవిధానమునకు పాశ్చాత్యవిధానమునకు హస్తిమశకాంతరమనియు భారతదేశౌన్నత్యమును వెల్లడించిరి”.

చలికాలమైనా కప్పుకోనక్కరలేని ఉపాయము

అమెరికాలోని జనరల్ ఎలెక్ట్రిక్ కంపెనీకి చెందిన డబ్ల్యు. క. లీర్ ప్లేగారు, ఎలెక్ట్రిక్ ప్రక్క ఒకటి కనిపెట్టాడు. ఈ ప్రక్క మీద పడుకొంటే ఎంత చలికాలంలోనైనా ఏమీ కప్పుకోనక్కరలేకుండానే వెచ్చగా ఉంటుంది. రెండు పలుచని దుప్పట్లు జోడించి వాటిమధ్య, సన్నని మెత్తనితీగ ఒకటి అంతటా సరిసమంగా సర్దుకొని ఉండేటట్టుగా అల్లి తయారుచేశాడాయన ఈ కొత్తరకం ప్రక్క. కాళ్లదిక్కున, తీగలోకి విద్యుత్తు ప్రవేశపెట్టడానికి ఏర్పాటుంటుంది. మామూలుగా ఇళ్లలో విద్యుద్దీపాలు వెలిగించుకోడానికి వాడుకొనే శక్తినే పక్కలో ప్రవహింపజేయడానికీ వాడవచ్చు. ఎటువచ్చీ, దానిని ప్రత్యేకంగా తయారుచేసిన ఒక పెట్టెలోంచి ప్రవహింపజేసి 23 వోల్టులశక్తి అయేటట్టు తగ్గించి ఆతరువాత పక్కలో ప్రవేశ పెట్టుకోవాలి. ఆ పెట్టెతల దిక్కున చేతికి అందేటట్టుగా ఉంచుకొని, పక్కమీద ఒత్తిగిలి కాస్తమీట నొక్కుతుంటే చాలు, ఆపాదమస్తకం హాయిగా వెచ్చనౌతుంది. కంబళ్ళూబొంతలూ ముసుగుపెట్టుకొని బాధపడ నగత్యముండదు. చలి ఎంతఉన్నా సరిపడిన వెచ్చ కలిగేటట్టు చేసుకోడానికి మీటనువల్లనే ఏర్పాటుంటుంది. మనిషికి ఏవిధమైన అపాయమూ లేకుండా కట్టుదిట్టాలన్నీ చేయబడ్డాయి యంత్రంలో. అవసరం లేనప్పుడు పక్కతీసి మడత పెట్టుకోవచ్చు. మాసిపోతే ఉతికించుకోనూవచ్చు. —విజ్ఞానం.

* * * *

అఖలభారత స్త్రీసమావేశము—పండిత జవహరలాల్ నెహ్రూ:

ఒక స్త్రీసమావేశములో మాటలాడుచు నెహ్రూపండితుడు అఖిలభారత స్త్రీసమావేశసభ్యుల వైఖరులను పద్ధతులను నిరసించుచు, "భారతస్త్రీ లెట్టి యభివృద్ధిబొందినను దానికి కారణము కాంగ్రెస్సేగాని యట్టి ఉన్నతవంశీయుల సంస్థ గాదు" అని నుడివెను.

ఈ వాక్యముల విమర్శించుచు మాడరన్ రివ్యూ పత్రిక యిట్లు వ్రాయుచున్నది:—

"నెహ్రూపండితుని యీవిమర్శలు కొంత హద్దుమీఱినవనవలెను. అభిజాత్యలగు స్త్రీలును ఉన్నత పదవి నాక్రమించిన పురుషుల భార్యలును, ఈ సమావేశములలో నెక్కుడు పలుకుబడిగలవారనుట నిక్కము. కానీ సామాన్యస్త్రీలును పనిచేయువారునుగూడ ఈ సమావేశమున సభ్యులుగానుండుట గమనింపవలసియున్నది. కాంగ్రెసుసంస్థ సైత మెంకనాడు అట్టి ధనికవర్గమువారికి లోబడియుండెను. నేటికిని కాంగ్రెసునాయకులలో ఖద్దరుధారిణులగు ధనికులుండుట యెల్లరెరుగుదురు.

రాజకీయముగా స్త్రీలకుగల స్థానమునకును వారి యభివృద్ధికిని చాలావఱకు కాంగ్రెస్సే కారణమని యందఱు ఒప్పుకోవలయును; కాని వారు పొందిన యభివృద్ధియంతటికిని కాంగ్రె సొకటియే కారణమనుట పొరపాటు. బ్రహ్మసమాజము, ఆర్యసమాజము, అనేక సాంఘికసమస్థలు, అఖిలభారత స్త్రీసమావేశము, నారీశిక్షాసమితి, సేవాసదనము, సరోజనదేవిగారి స్త్రీశ్రేయస్సమితి, ఇంకను నిట్టి పెక్కు ఇతరసంఘములు—ఇవి స్త్రీపురోభివృద్ధికారకములు.

గృహకృత్యములకు తోడ్పడు శాస్త్రముల నేర్పుటకు నొక ప్రత్యేకకళాశాల నిర్మించుకొనుట స్త్రీలకు హెక్కులన్నవి. శారదాబిల్లు, 'Age of Consent Bill', ఇవి శాసనములగుటకు స్త్రీలెంతో కృషిసలిపినారు.

రాజకీయముగా స్త్రీలదృష్టి యెట్టిదో గమనింపుడు. వయోజనవోటింగు అధికారము, సమష్టి నియోజకవర్గములు, స్త్రీలకు స్థానము ప్రత్యేకింపబడ నక్కఱలేదనుట—అధఃపతితోద్ధరణము ఇవి."



# సంపాదకీయములు

## కొచ్చిను సంస్థానము: స్త్రీల ప్రాతినిధ్యము.

నేడు కొచ్చిను సంస్థానమునుండి వచ్చుచున్నవార్తలు ముదావహముగ నున్నవి. ఇంతవఱకు నీసంస్థానమున స్త్రీలకు పురుషులతో సమానముగ ఎన్నికహక్కుగాని, శాసనసభయందు తగిన ప్రాతినిధ్యముగాని లేకుండెడిది. ఈలోటును పూర్తిచేయుచు కొచ్చిను ప్రభుత్వము స్త్రీలకు పురుషులవలెనే ఎన్నికహక్కు స్థిరపఱచియున్నారు. శాసనసభకు ఎన్నుకొనబడు ప్రతినిధులందు స్త్రీలకై రెండుస్థానములు ప్రత్యేకింపబడినవి. స్త్రీలకొసగబడిన యీయెన్నికహక్కు శాసనసభలందు తమ యిబ్బందులను చక్కచేసికొనుట కుపకరించునని నమ్ముచున్నాము.

కొచ్చినుసంస్థానము ఛాందస సంప్రదాయముల పీఠదని నిన్న మొన్నటివఱకు అఖిలభారతదేశము తలంచుచుండెడిది. ఇట్టి సంస్కరణములా అపయశస్సును పూర్తిగా తొలగింప గలవు. తిరువాంకూరువంటి సోదర సంస్థానమువలెనే కొచ్చిను అన్నిటియందును ముందంజవేసి ఇతరసంస్థానములకు మార్గదర్శియై యుండ కోరెదము. తమ ప్రభుత్వమునందు స్త్రీలకు ప్రాతినిధ్య మొసగని యితర స్వదేశసంస్థానములు ఆ యాటంకమును దొలగించుగాక.

* * *

## మీ-లింగ్ - చీనా జపాను యుద్ధము.

నేటి చైనాఅధ్యక్షుఁడగు చియాంగ్–కే–షేక్ యొక్క సతీమణియే మీ–లింగ్. ఐ–లింగ్, చింగ్–లింగ్, మీ–లింగ్ మువ్వురు అక్కచెల్లెండ్రు. అనదృశమేధావులు. చార్లెసు సూంగ్ కుమరితలు; చైనాయభివృద్ధికి మూలకందములు. మువ్వురును అమెరికాయందున్నత విద్య నభ్యసించి చైనాపురోవృద్ధికి మార్గములన్వేషించి, కార్యక్రమమునకు గడంగినవారు. వీరిలో అగ్రజ ప్రఖ్యాతము వర్తక, కార్మికశాఖలకు మంత్రిగనున్న డాక్టరు హెచ్. హెచ్. కుంగ్‌ను వివాహమాడినది. రెండవ యామెయగు చింగ్-లింగ్ చైనా ప్రజాప్రభుత్వనిర్మాతయు ప్రథమాధ్యక్షుడునునగు చైనా స్వాతంత్ర్య ప్రతిష్ఠాపనకై జీవితమంతయు పాటుబడిన సన్-ఎట్-సేన్ సతీమణి. భర్త మరణానంతర మీమె భర్త యాశయముల వ్యాపింప జేయుటకై పాటుబడుచున్నది.

# సంపాదకీయములు

కనిష్ఠసోదరియగు మీ-లింగ్ యున్నత విద్యలబడసి చైనాకు వచ్చినతోడనే సంఘసంస్కరణమందు తీవ్రమైన కృషి చేయ ప్రారంభించినది. 1927 నందు ఇప్పటి యధ్యక్షుని జపానునందు వివాహమాడినది. అప్పటినుండియు నేటివఱకు భార్యాభర్తలిరువురు చైనాదేశపు ఔన్నత్యమునకై పాటుబడుటే యానందముగ నెంచుచున్నారు. నేటి చైనాయుద్ధ సంఘసమితియందు మీ-లింగ్ యొకసభ్యురాలు. ఇది యపూర్వము!

ఈమె స్వయముగ చైనాయందు జపాను గావించుచున్న దురంతదుర్మార్గములను హిందూపత్రికకు వ్రాయుచున్నది. ఆమె వ్రాతలందు ఆమె ఔన్నత్యము, ధైర్యసాహసములు, దేశభక్తి యుట్టిపడుచున్నవి. అన్యాయముగ తమదేశమును కబళింపదండెత్తిన, మాతృదేశమును రక్షింపబూనుకొన శత్రువుల నడ్డగించిన సైనికుల హతమార్పవచ్చును. వారందఱు సంసిద్ధులైయే యున్నారు. కాని యే పాపమెఱుగని — పసినిసుగులు, స్త్రీలు, వృద్ధులు — ప్రజలను వేలకొలదిగ చిత్రవధజేయు టెందుకు? వందలకొలదిసంవత్సరములుగా నిర్మింపబడిన వానిని భస్మీభూతమొనర్చు టెందుకు? మీ-లింగ్‌కు ఇందలి అంతరార్థము తెలియును. జపాను చైనాయందు భీభత్సములు చేసి ప్రజలను భయపెట్టి సంధికి మార్గము చూచుకొనదలంచినది. 'కాని తనసైన్యము బ్రతికియుండగా, తనప్రజలు చిత్రవధచేయబడుచుండ యేదేశముసంధిచేసికొనగలదు?' అని మీ-లింగ్ యభిప్రాయము. 'నేనుచాల కాలమునుండియు నతిశ్రద్ధగా దేశాభివృద్ధికి చేసిన నిర్మాణ కార్యక్రమ మంతయు నతిహేయముగ నాశనము గావింపబడినది' అని యామె చింతించుచున్నను, 'చైనాయందున్న అంతఃకలహములన్నియు నంతరించినవి. అంత్యమువఱకు మేమందఱము గలసి పోరెదము' అని ధీరత్వమును జూపుచున్నది. ప్రారంభించిన కొలదిరోజులలోనే చైనాను కబళింపగల ననుకొన్నది జపాను. కాని ప్రారంభించినదానికి ప్రత్యూషమైనది. ఒక్కమారుగా గాకున్నను క్రమక్రమముగా నన్నివిధముల నొత్తిడిగలిగించి జపానుకు గావలసినశాంతి చేయవచ్చునని మీ-లింగ్ యుద్దేశము.

ఇంతటి ధీరత్వముతో విదేశదౌష్ట్యముల నెదుర్కొనుచున్న నిట్టి వీరవనితల భారతనారీమణులు తప్పక గౌరవింతురనియే మా నమ్మకము. అగుచో, జపానువస్తువుల నన్నింటిని బహిష్కరించుటకు పట్టుదల గల్గి యుందురుగాక.

EDITED BY DR. K. N. KESARI, PRINTED AND PUBLISHED
BY DR. S. SESHAGIRI RAO, AT THE LODHRA PRESS, ROYAPETTAH, MADRAS.

ఈశ్వర సం॥ర ఆశ్వయుజ కార్తీకములు



| | |
|---|---|
| 1 | త్ర॥ సో ఉ6-42 హ ఉ11-31 వ తె4-0 వం5-41కు భా°7-4 నరకచతుర్దశి |
| 2 | చతు॥ మం ఉ7-39 చిత్ర ప11-43 వ సా6-56 వం8-39కు భా°7-0 దీపావళి |
| 3 | అమా॥ ● బు ఉ8-50 స్వా ప2-44 వ రా8-52 వం10-37 భా°6-56 ఆకాశదీపప్రారంభము |
| 4 | శు॥ పా గు ఉ10-28 విశా సా4-46 వ రా10-0 వం11-46 భా°6-52 |
| 5 | వి॥ శు ప12-24 అనూ రా7-27 వ రా1-40 వం3-26కు తృతీయతిథి భా°6-48 |
| 6 | తృ॥ శ ప2-32 జ్యే రా10-4 వర్జంలేదు భా°6-44 శూన్యతిథి |
| 7 | చ॥ ఆ సా4-40 మూ రా12-39 వ ఉ6-56 వం8-42కు వ రా11-33 వం1-19కు భా°6-40 నాగులచవితి |
| 8 | పం॥ సో సా6-37 పూషా రా3-3 వ ఉ11-13 వం భా°6-36 |
| 9 | ష॥ మం ర8-16 ఉషా తె5-4 వ ప11-43 వం1-27 భా°6-3. |
| 10 | స॥ బు రా9-31 శ్రవ ఉ వ ఉ9-21 వం11-4కు భా°6-28 |
| 11 | అ॥ గు రా9-59 శ్ర ఉ6-36 వ ఉ10-47 వం12-27 భా°6-20 |
| 12 | న॥ శు రా10-28 ధ ఉ7-42 వ సా3-5 వం4-43కు భా°6-16 |
| 13 | ద॥ శ రా10-12 శత ఉ8-18 వ సా2-44 వం4-20 భా°6-12 |
| 14 | ఏ॥ ఆ రా9-24 పూ భా ఉ8-25 వ సా5-56 వం7-31కు భా°6-8 బోధనఏకాదశి తుంగభద్రాపుష్కర ప్రారంభము |
| 15 | ద్వా॥ సో రా8-11 ఉ భా ఉ8-6 వ రా7-48 వం9-21కు భా°6-4 క్షీరాబ్ధిద్వాదశి |
| 16 | త్ర॥ మం సా6-34 రే ఉ7-21 అశ్వ తె6-21 వ రా2-35 వం4-7కు వృశ్చిక భా°8-25 |
| 17 | చతు॥ బు సా4-40 భ తె5-1 వ సా3-25 వం4-55 భా°8-20 జ్వాలాతోరణము |
| 18 | పూ॥ ○ గు సా2-32 కృ తె3-26 వ సా4-13 వం5-43కు భా°8-16 తిథిద్వయం మహాకార్తీకి |
| 19 | బ॥ పా శు ప12-14 రో రా1-46 వ సా6-23 వం7-52కు భా°8-12 ద్వితీయా తిథి |
| 20 | ది॥ శ ప9-54 మృ రా12-5 ఉ7-0 వం8-29కు భా°8-8 |
| 21 | తి॥ ఆ ఉ7-31 చవితి తె5-11 ఆర్ద్ర రా10-27 ఉ7-55 వం9-25కు భా°8-5 |
| 22 | పం॥ సో తె3-4 పున రా8-59 వ ఉ9-43 వం11-16కు వ తె4-35 వం6-6కు భా°8-0 |
| 23 | ష॥ మం రా1-11 పుష్య రా7-44 వర్జంలేదు భా°7-56 |
| 24 | స॥ బు రా11-40 ఆశ్రే సా6-46 వ ఉ8-1 వం9-33కు భా°7-52 |
| 25 | అ॥ గు రా10-26 మ సా6-8 వ ఉ6-27 వం8-1 వ రా2-58 వం4-33కు భా°7-48 |
| 26 | న॥ శు రా9-45 పుబ్బ సా5-59 వ రా1-26 వం2-53కు భా°7-44 |
| 27 | ద॥ శ రా9-28 ఉత్తర సా6-15 వ రా2-55 వం4-34కు భా°7-40 |
| 28 | ఏ॥ ఆ రా9-45 హ రా7-0 వ తె3-26 వం5-7కు భా°7-36 |
| 29 | ద్వా॥ సో రా10-30 చిత్ర రా8-14 వ రా3-11 వం4-54కు భా°7-32 |
| 30 | త్ర॥ మం రా11-48 స్వా రా10-0 వ తె4-6 వం5-50కు భా°7-28 |

# ప్రసవకాలమును దెలుపు పట్టిక.

సాధారణముగ స్త్రీలు గర్భము ధరించిన 280 దినములకు ప్రసవించెదరు. కడపటి బహిష్ఠయైన మొదటిదినము మొదలు లెక్క పెట్టుకొనవలయును. క్రిందకనుబరచిన పట్టిక మొదటిపంక్తి జనవరి 1.వ తారీఖున గర్భము ధరించినయెడల రెండవపంక్తి అక్టోబరు 8-వ తారీఖున ప్రసవించెదరు

| | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| జనవరి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | జనవరి |
| అక్టోబరు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | నవంబరు |
| ఫిబ్రవరి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | | | | ఫిబ్రవరి |
| నవంబరు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | | | | డిసెంబరు |
| మార్చి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | మార్చి |
| డిసెంబరు | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 33 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | జనవరి |
| ఏప్రెల్ | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | ఏప్రెలు |
| జనవరి | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | | ఫిబ్రవరి |
| మే | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | మే |
| ఫిబ్రవరి | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | మార్చి |
| జూన్ | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | జూన్ |
| మార్చి | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | | ఏప్రెలు |
| జూలై | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | జూలై |
| ఏప్రెల్ | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 23 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | మే |
| ఆగస్టు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | ఆగస్టు |
| మే | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | జూన్ |
| సెప్టెంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | సెప్టెంబరు |
| జూన్ | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | | జూలై |
| అక్టోబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | అక్టోబరు |
| జూలై | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | ఆగస్టు |
| నవంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | నవంబరు |
| ఆగస్టు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | | సెప్టెంబరు |
| డిసెంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | డిసెంబరు |
| సెప్టెంబరు | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 87 | అక్టోబరు |

తే. అగ్రవర్తియై శ్రీరాముఁ డరుగుచుండె, నువిద తనుమధ్య మధ్యమం దుండెసీత,
మహిత కోదండదండ సంభరణహస్తుఁ డోలివెన్నంటె లక్ష్మణుఁ డొప్పుప్రేమ.

మానిని. సారములౌ నవసారసకైరవ సౌరభవాసిత భాసితకా
సారములుం దటినీతటిసైకత సంచరదంచిత చక్రయుగీ
వారములుం గిరిసుందరకందర పాతసుపూత ఝరీలహరీ
పూరములుం సుమమంజులకుంజక పుంజితగుంజ దళీంద్రములుం.

కం. భీకరసూకర పృథు దర్వీకర కాసరకరాగ్ర విస్మృత హిమవ
చ్ఛీకర కరికేసరి నికరాకర గహ్వర వితాన మాదటఁగనుచుం.

శ్రీ మదాంధ్ర వాల్మీకిరామాయణము.